# ఆంధ్రపత్రిక



The Andhra Patrika, Madras. } Regd. No. M. 1118 Vol. 36 No. 267 FRIDAY 30th DECEMBER 1949 వెల ఒకఅణా } Founder: K. NageswaraRao

# అన్ని హంగులతో రాజధాని ఏర్పడేవరకూ మద్రాసులోనే ఆంధ్ర ప్రభుత్వ కార్యాలయాలు, హైకోర్టు ఏర్పాటు

## తూర్పుపంజాబుకు పెట్రోల్ రాకుండా పాకిస్థాన్ ఆటంకం

### ఇండియా బొగ్గు ఎగుమతి నిలిపినందుకు అంతర్జాతీయ ఒప్పందానికి విరుద్ధంగా కరాచీప్రభుత్వ ప్రతీకారం

న్యూఢిల్లీ, డిసెంబర్ 28: పాకిస్థానుకు వెళ్లే బొగ్గు ఎగుమతులను తాత్కాలికంగా నిలిపివేయాలని చేసుకున్న నిర్ణయానికి ప్రతీకారంగా తూర్పుపంజాబుకు పెట్రోలు రవాణా సౌకర్యాలను పాకిస్థాన్ బందుచేయవచ్చునని తెలుస్తున్నది. అయితే ఈవార్త ఇక్కడి అభిజ్ఞవర్గాలకు ఆశ్చర్యం కలిగించలేదు.

పెట్రోలు సప్లయి పాకిస్థాన్ భూభాగంద్వారా తూర్పు పంజాబుకు అందించవలెనని ప్రపంచదేశాలన్నీ కలిసి బార్సిలోనాలో చేసుకున్న అంతర్జాతీయ ఒప్పందం నిర్దేశిస్తున్నది. అందువల్ల ఈ విధంగా సప్లయిలను బందుచేస్తే పాకిస్థాన్ అంతర్జాతీయనియమాన్ని ఉల్లంఘించినట్లు భారతదేశప్రభుత్వం ఫిర్యాదు చేస్తుందని ఈ అభిజ్ఞవర్గాలవారు భావిస్తున్నారు. అప్పుడు ఉభయదేశాలమధ్యనూ ఉన్న అంతరధిని వేళ వివాదం అంతర్జాతీయసమస్యగా పరిణమించగలదు.

బార్సిలోనా ఒప్పందంలో పాల్గొన్న దేశాలన్నీ తమ పొరుగు దేశాలకు పంపబడే సరుకులకు రవాణా సౌకర్యాలను ఇవ్వవలసి ఉన్నది. ఇండియా పాకిస్థాన్‌లు ఈ ఒప్పందంలో పాల్గొన్నవి.

ఈ ఒడంబడికను భగ్నపరుస్తూ పెట్రోలు రవాణాను అరికట్టటానికే పాకిస్థాన్ నిర్ణయిస్తే ఇండియా తాను పాకిస్థానుకు చేస్తున్న సహాయాలు సప్లయిల విషయమై ఆలోచించ గలదు. ఇండియా పశ్చిమ పంజాబుకు సప్లయి చేస్తున్న విద్యుచ్ఛక్తి కాలవల నీరు మొదలైన అంశాల విషయమై ఇండియా మార్పులు చేయవచ్చును.

#### ఇండియా వాదం

పాకిస్థానుకు బొగ్గు ఎగుమతులను ఇండియా నిలిపివేయటానికి కారణం, ఉభయ దేశాలు చేసుకున్న వాణిజ్య ఒడంబడికను పాకిస్థాన్ అతిక్రమించటమేనని వీరు చెపుతున్నారు. ఇండియా పాకిస్థానుకు వెళ్లే సరుకుల రవాణా మీద ఎటువంటి నిర్బంధాలనూ విధించలేదనీ,

(2-వ పేజీ చూడుడు)

## భూస్వాములనుండి నిర్బంధ వసూళ్లు

### ఆర్థికమంత్రి ప్రతిపాదన విరమణ

మదరాసు, డిశంబర్ 29: ప్రజోపకరమగు నిర్మాణ కార్యక్రమముల నిమిత్తము భూస్వాములనుండి నిర్బంధముగా ఋణములు తీసుకొను ప్రతిపాదన ప్రస్తుతమునకు వాయిదా వేయబడినట్లు తెలియుచున్నది.

భూస్వాములనుండి ఒక సంవత్సరము భూమిశిస్తుకు సరియైన మొత్తమును నిర్బంధముగా వసూలుచేయవలెనను ప్రణాళికకు ప్రభుత్వము పట్టుదలతో లేదని తెలియుచున్నది.

ఆర్థిక మంత్రి శ్రీ గోపాలరెడ్డి గారు ప్రస్తుతము ఈవిషయమును గురించి ప్రభుత్వము ఆలోచించుటలేదని తెలిపిరి.

## రైలులో బొంబైకి పటేల్ ప్రయాణం

న్యూఢిల్లీ, డిసెంబరు 29: ఉపప్రధాన మంత్రి సర్దార్ వల్లభాయ్‌పటేల్ యీవేళ ప్రొద్దున రైలులో బొంబయికి బయలుదేరెను.

## క్షయ నిర్మూలనకు విరివిగా బి. సి. జి. టీకాల కేంద్రాలు

### కొత్తగా 46 దళాలను ఏర్పాటు చేయడానికి భారతప్రభుత్వ నిర్ణయం

న్యూఢిల్లీ, డిసెంబరు 28: ఇండియా ప్రభుత్వంవారు బీసీజీ టీకాలద్వారా క్షయవ్యాధిని నిర్మూలించడానికి నిర్ణయించారు. ఈవాక్సినేషనులు 1948 ఆగస్టులో ప్రారంభించబడినవి.

ప్రస్తుతం స్కాండినేవియా దేశాలకు చెందిన నిపుణులదళాలు ఆరు ఇండియాలో పనిచేస్తున్నవి. వాటితోపాటు 21 భారతీయ దళాలుకూడా పనిచేస్తున్నవి. భారతీయులు ఇతర భారతీయులకు శిక్షణ ఇవ్వనున్నారు.

వెంటనే ఇటువంటి దళాలు 46 ఏర్పడవలసి ఉన్నది. ఇందుకుగాను తగిన మనుష్యులను సమకూర్చగలరా అని కేంద్రం రాష్ట్ర, సంస్థానప్రభుత్వాలను అడిగింది. రాష్ట్ర సంస్థాన ప్రభుత్వాలు ఈ సందర్భంలో చూపే ఉత్సాహ సహకారాలకు అనుగుణంగా అంతర్జాతీయ బాలనిధినుండి వారివారికి సహాయం లభిస్తుంది.

ఈఉద్యమంగురించి వివరిస్తూ ఇండియా ప్రభుత్వ క్షయ సలహాదారు డా॥ బెంజమిన్ ఈ విషయాలు తెలిపారు:

బీసీజీ టీకాలపై ప్రజలకు మొదటినుండిన ఆక్షేపణ ఇప్పుడులేదు. తిరువాన్కూరులోనూ, కాన్పూరులోనూ ప్రజలు 20 మైళ్లు ప్రయాణం చేసి వచ్చి వాక్సినేషను చేయించుకొన్నారు. ప్రస్తుతం ఇండియా ఉన్న పరిస్థితులనుబట్టి క్షయ నిర్మూలనకు బీసీజీ సర్వోత్తమమైనమార్గం. ఈ వ్యాధితో ఇండియాలో ఏటా 5 లక్షలు చనిపోతున్నారు. 25 లక్షలమంది క్షయతో తీసుకొంటున్నారు. జీవనప్రమాణాలు తక్కువగా ఉండటమూ, గృహసౌకర్యాలు సరిగా లేకపోవడమూ, పట్టణాలలో జన సమ్మర్దమూ, అనారోగ్యకరమైన తిండీ, —కొంతగా అధికంగా వ్యాప్తిచెంది ఉండటం ఈ క్షయవ్యాధి సోకడమూ, దానివల్ల చావులూ జాస్తిగా ఉన్నవి.

ఇండియాలో 10 కోట్లమందికి ఈ వాక్సినేషను అవసరం. వారు చాలావరకు 20 కి లోబడిన వయసుగలవారు. అయిదేళ్ల కాలంలో 8 కోట్లమందికి ఇంజెక్షను లివ్వాలంటే 200 దళాలు అవసరం. ఒక్కొక్క దళానికి ముగ్గురు సుశిక్షితులూ, ఇతరులూ, ఒక మోటారు వాహనమూ అవసరం. 200 దళాలనూ ఏర్పరచడానికి 3 కోట్లు ఖర్చవుతుంది. ఏటా వాటిని నిర్వహించడానికికూడా 3 కోట్లు ఖర్చు ఉంటుంది.

స్కాండినేవియను నిపుణులు మరికొద్ది మాసాలపాటు ఇండియాలో ఉండి 60 భారతీయ దళాలను తయారుచేస్తారు. ఈలోగా 5 లక్షలమందికి వాక్సినేషనులు ఇవ్వబడతవి 1950 నాటికి 200 భారతీయ దళాలు ఏర్పడి ఉంటవి.

విదేశీదళాలు ప్రస్తుతం తూర్పుపంజాబు సంస్థానాలలో, అస్సాము, బీహారు, యు. పి., బొంబాయి రాష్ట్రాలలో, సౌరాష్ట్ర, హైదరాబాదు సంస్థానాలలో పని చేస్తున్నవి.

## ప్రత్యేక ఆర్డినెన్సుద్వారా భీమాచట్ట సవరణ బిల్లు అమలుజరిపే ఆలోచన

[ఆంధ్రపత్రిక విలేఖరి]

న్యూఢిల్లీ, డిసెంబర్ 28: ప్రస్తుతం పార్లమెంటు సెలెక్టుకమిటీవారు పరిశీలిస్తున్న బీమాబిల్లులోని ప్రధానాంశాలను ఆర్డినెన్సుద్వారా అమలు జరుపుతారని తెలుస్తున్నది. యీ ముఖ్యాంశాలు పెట్టుబడికి, పోటుచేసే హక్కులకూ, భీమా కంపెనీలు చేసే పెట్టుబడులకూ, భీమా కంపెనీల పర్యాప్తతకూ చెందినవి.

ఈ బిలు సకాలంలో పార్లమెంటులో ప్రవేశపెట్టి, జనవరినుంచి డిసెంబరువరకు సాలు చిట్టాలుగల భీమాకంపెనీలకు అనుకూలంగా 1950 జనవరి 1వ తేదీనుంచి బిల్లును అమలుజరుపుతామని ప్రభుత్వం వారు భావించారు. కాని కొందరు స్వార్థపరుల ప్రయత్నానికి విఘ్నంకలిగించి బిల్లును పార్లమెంటుబడ్జెట్ సమావేశానికి

(2-వ పేజి చూడుడు)

## ఆంధ్రనాయకుల సూచనకు తమిళప్రతినిధుల ఆమోదం

### తాత్కాలిక రాజధాని స్థలనిర్ణయం: ప్రత్యేక హైకోర్టు స్థాపనకు జనవరి 5-న అసెంబ్లీలో బిల్లు ప్రతిపాదన

### శుక్రవారం విభజనసంఘ ఆఖరు సమావేశం

ఆంధ్ర నాయకులు తమ రాష్ట్ర తాత్కాలిక రాజధాని స్థలమును నిర్ణయించి, ఆంధ్ర మంత్రులు, గవర్నరు అచటనే ప్రమాణ స్వీకరణచేయుటకు, శాసనసభ సమావేశములను జరుపుకొనుటకు ఆ తాత్కాలిక రాజధానిలో ఏర్పాట్లుచేసుకొనిన, ఆంధ్ర ప్రభుత్వ కార్యాలయములు, ఆంధ్ర హైకోర్టు, అన్నిహంగులతో రాజధాని ఏర్పడువరకు మద్రాసులోనే వుండవచ్చునని తమిళ నాయకులు హామీ ఇచ్చినట్లు, విభజన సంఘము గురువారము సమావేశానంతరము సమ్మతముగా తెలియవచ్చినది. ఈ ఏర్పాటు అధమము మూడు సంవత్సరములవరకు అమలునందుండగలదని విషయజ్ఞులు భావించుచున్నారు.

ఆంధ్రరాష్ట్ర తాత్కాలిక రాజధాని స్థల నిర్ణయము జరిగినట్లున్నూ 3 వ తేదీ జరుగు ఆంధ్ర శాసనసభ సభ్యుల, రాష్ట్ర కాంగ్రెస్ సంఘసభ్యుల ఆమోదమునకు లోబడి అనంతపురమునే ఈ తాత్కాలిక రాజధానిగా నిర్ధారణచేసుకొని ఆ విషయమును ఆంధ్ర నాయకులు తమిళ ప్రతినిధులకు తెలుపుటవలన ఈ సమస్యపై విధముగ పరిష్కారమైనదని అభిజ్ఞవర్గములలో విచారింపగా తెలియుచున్నది.

విభజనసంఘ సమావేశము నేడు (డిసెంబరు 29) ఉదయం 8-30 గంటలనుండి 10-30 వరకూ జరిగెను. ఈ సంఘ సమావేశములు రేపటితో పూర్తికాగలవని అధికారరీత్యా తెలిసినది. ఆంధ్రకు ప్రత్యేక హైకోర్టు ఏర్పాటు చేయుటకుగాను జనవరి 5 వ తేదీన అసెంబ్లీలోను, 7 వ తేదీన కౌన్సిల్‌లోనూ అధికారబిల్లు ప్రతిపాదన జరుగగలదు. ఆ బిల్లునందే హైకోర్టు కార్యస్థానము ఎక్కడ ఉండునది ఉదహరింపబడగలదనికూడా తెలియుచున్నది.

ఆంధ్రరాష్ట్ర విభజనసంఘం నేడు, గొ॥ మాధవమీననుగారుతప్ప తక్కిన అందరు సభ్యులతో ఉదయం 8-30 గ. నుండి 10-30 గం. వరకు సమావేశమయ్యెను. ఆర్థికశాఖ కార్యదర్శి, ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి, పుల్లారెడ్డి, గార్లుకూడా హాజరయ్యిరని, సంఘ కార్యదర్శి ఎస్. వెంకటేశ్వరనుగారు విలేఖరులకు తెలిపిరి.

హైకోర్టు విభజించాలని గవర్నరుగారిని కోరుచు శాసన సభలు రెండింట వేరువేరుగ ప్రతిపాదించవలసిన తీర్మానం ముసాయిదా అంగీకరించబడెను. అది నేడు శాసన సభ్యులకు పంపబడును. అసెంబ్లీలో 5-న తేదీని గొ॥ మాధవమీననుగారు కౌన్సిలులో డా॥ రాజనుగారు 7వ తేదీని యీ తీర్మానం ప్రతిపాదింతురు.

ఆంధ్రహైకోర్టుందేస్థలంకూడా అందు పేర్కొనబడును. ఆస్తి అప్పుల పంపకం

(5-వ పేజి చూడుడు)

## "భాషాప్రయుక్తరాష్ట్ర నిర్మాణంవల్ల దేశ ఐక్యతదృఢతర మౌతుంది"

### దక్షిణ భారత సాహిత్య సభలో ఆచార్య నరేంద్రదేవ్ ఉద్ఘాటన

హైదరాబాదు, డిసెంబరు 28: "భాషాప్రయుక్తంగా రాష్ట్రములను పునర్నిర్మాణం చేసినచో భారతదేశ ఐక్యత దృఢతరం కాగలదు. హిందీని ఒక రాష్ట్రానికి మరొక రాష్ట్రానికి మధ్య వ్యవహారభాషగామాత్రమే వుంచి, ప్రాంతీయభాషలను స్వేచ్ఛగా అభివృద్ధి కానీయవలెను," అని లక్నో విశ్వకళాపరిషత్తు వైస్‌ఛాన్సలర్ ఆచార్య నరేంద్రదేవ్ నేడిక్కడ ఉద్ఘాటించారు.

హిందీనగర్‌లో నేటిసాయంత్రం జరిగిన దక్షిణ భారతసాహిత్యసభకు అధ్యక్షతవహించి, ఉపన్యసిస్తూ ఆచార్య నరేంద్రదేవ్ ఇలా చెప్పారు.

"ఉత్తర, దక్షిణాలు ఇంకాసన్నిహితంగా కలిసిపోవాలి. ముఖ్యంగా ఉత్తరభారతీయులు తమకు దాక్షిణాత్యులపై ఏవిధంగాను అధికారం చెలాయించాలనే ఉద్దేశ్యంలేదని నిరూపించి చూపాలి. ఔత్తరాహులు కనీసంఒక్కటైనా దక్షిణభారతభాషను నేర్చుకోవాలి. దాక్షిణాత్యులు ఉత్తరపువారిని అర్థంచేసుకొనటానికి, జాతీయైక్యతను దృఢపరచడంలో సహకరించటానికి ప్రయత్నించాలి"

సాహిత్యసభయొక్క ఉద్దేశ్యములను వివరిస్తూ ఆహ్వానసంఘాధ్యక్షుడు ప్రొఫెసర్ టి. వీరభద్రుడుగారిట్లా చెప్పారు.

"ఈ సంస్థానంలో మాట్లాడే భాష

5 వ పేజీ చూడుడు)

## ప్రభుత్వప్రోత్సాహంతో నౌకారవాణాసంస్థ

### సింధియా కంపెనీ నిర్వాహకత్వాన వచ్చేనెలనుండీ ప్రారంభం

బొంబాయి, డిశంబర్ 28: ప్రభుత్వ ప్రోత్సాహంక్రింద స్థాపించబడుతున్న మొదటి నౌకారవాణాసంస్థకు (షిప్పింగ్ కార్పొరేషన్) వచ్చే మాసారంభంలో లాంఛనప్రాయంగా ప్రారంభం జరుగుతుంది. 'సింధియా స్టీమ్ నావిగేషన్ కంపెనీ' వారు ఈసంస్థకు నిర్వాహకులుగా పని చేస్తారు.

'ఈ నౌకారవాణాసంస్థను ప్రారంభించటానికి కావలసిన యేర్పాట్లన్నీ పూర్తి అయినై. ఏయే నౌకామార్గాలలో ముందు వ్యాపారం ప్రారంభించవలసి వున్నదీకూడా నిశ్చితమైంది. ఈ సంస్థక్రింద మొత్తం యెన్ని ఓడలను కొనుగోలు చేయబోతున్నదీ వగైరా వివరాలన్నిటినీ వచ్చేనెలలో ప్రభుత్వం ఒక బహిరంగ ప్రకటన చేస్తుంది' అని నిర్వాహకవర్గంలో ప్రభుత్వపక్షాన వ్యవహరించటానికిగాను ప్రభుత్వ ప్రతినిధిగా నియమించబడిన యల్. దండేకర్ ఈవేళ తెలియజేశారు.

ఈ సంవత్సరారంభంలో ప్రభుత్వం, పదేసివేల టన్నుల బరువు మోయగలరెండు కెనడా నౌకలను కొన్నారు. ఒకొక్కటి 20 లక్షల రూపాయలకు కొన్నారు. ఇవి 1944 సంవత్సరంలో నిర్మాణం చేసినవి. జూలై 5 వ తేదీనుంచీ వీటిని సింధియా కంపెనీవారి నిర్వహణలోనే ఇండియా ఆస్ట్రేలియాలమధ్య నడుపుతున్నారు. ఈ రెండు నౌకలతోనే ముందు ఈ సంస్థను ప్రారంభించుతారు.

1947 నవంబర్‌లో, నాడు భారత ప్రభుత్వ వాణిజ్య మంత్రిగావున్న సి. హెచ్. భాభా ఒకప్రకటన చేశారు. ఆ ప్రకటనలో ప్రభుత్వ ప్రోత్సాహంక్రింద ఒక మూడు 'ఓడరవాణా' సంస్థలను స్థాపించటానికి ఆలోచన వున్నట్లు, ఈ దిగువ విధంగా కొన్ని వివరాలు ప్రకటించారు. ప్రభుత్వం నూటికి 51 వంతుల పెట్టుబడిని యిస్తుందనీ, ఈమూడు సంస్థలలో ప్రతి ఒక్కదానికీ 10 కోట్ల రూపాయల పెట్టుబడి కావలసివస్తుందనీ. దీనిలో

నూటికి 51 వంతులు ప్రభుత్వ మిస్తుందనీ, 26 వంతులు సింధియా కంపెనీవారు పెట్టుబడిపెట్టి నిర్వాహకులుగా పనిచేస్తారనీ, తక్కిన 23 వంతులూ ప్రజలవద్ద తీసుకుంటారనీ తెలియజేశారు

## తిరువూరు గ్రామాలపై దాడులు దోపిడీలు

### 19 మంది కమ్యూనిస్టుల అరెస్టు

విజయవాడ, డిసెంబర్ 29: తిరువూరు తాలూకా గ్రామాలపై ఇటీవల దాడి జరిపిన కమ్యూనిస్టులు 19 మందిని అరెస్టు చేయడమైనట్లు కృష్ణా జిల్లా పోలీసు సూపరింటెండెంటు సి. జె. పి. పింటో తెలియ చేశారు. వీరు నిన్న తిరువూరు నుంచి ఇక్కడికి వచ్చారు. వీరిలో 9 మంది మల్లవరం దోపిడీ కేసులో పాల్గొన్నట్లు కూడా తెలిసింది. ఆ దోపిడిలో పోయిన రూ. 1200/- లక్షాత్తు కూడా దొరికిందట. ఊరగూడెంలో దోపిడీ అయిన సొత్తు కూడా దొరికిందట.

గన్నవరం, గుడివాడ తాలూకాలలో కుప్పలు తగలపెట్టడంగురించి పింటో గారు గ్రామ కక్షలతో కుప్పలు తగలపెట్టుకోవడం మామూలేనని ఇప్పుడు జరిగినవి కూడా అట్లాంటివేనని తమకు తెలిసిందనీ, అన్నారు.

గన్నవరం తాలూకా జక్కిపాడులో దాదాపు 200 బస్తాల ధాన్యం ఉండగల కుప్పలు తగులపెట్ట బడినట్లు వార్త తెలిసింది. ఇది కమ్యూనిస్టుల కృత్యమని అనుకున్నారు. (స్వ. వి.)

## రాజేంద్రప్రసాద్

చెన్నపట్నం, డిసెంబరు 29: అఖిల భారత వ్యవసాయ ఆర్థిక మహాసభ అధ్యక్షులు డా॥ బాబు రాజేంద్రప్రసాద్ గారు 1950 జనవరి 1-వ తేదీ సాయం. 4 గం. విమానంలో మీనంబాక్కం విమానాశ్రయంలో దిగెదరు. మహాసభకు వచ్చే ప్రతినిధులకు స్వాగతమొసగుటకు బసలు మున్నగు సౌకర్యముల ఏర్పాట్లన్నీ మహాసభ ఆహ్వానసంఘమువారు పూర్తిచేసియున్నారు. సెంట్రల్, ఎగ్మూరు స్టేషనులలో దిగే ప్రతినిధులను వాలంటీర్లు కలుసుకొని బసలకు తోడ్కొనిపోవుదురు. ప్రతినిధులు బసచేయుటకు ప్రభుత్వ భవనం, హోటలు కన్నిమారా, బోస్టొన్, ఉడ్‌లాండ్సు, మెరీనా, అజంతా హోటళ్లలో ఏర్పాట్లు గావింపబడినవి. ప్రతినిధులకు యింకా వర్తమానము యేమైనా కావలసినట్టయితే నాంటుకోడవలెనండని ప్రభుత్వ భవనమునగల కాంగ్రెస్ శాసనసభా పార్టీ ఆఫీసుగదిలోని ఆహ్వానసంఘ కార్యాలయమున తెలుసుకొనవచ్చును.

## గుంటూరు పంచాంగం

విరోధి సం॥ పుష్య శు॥ దశమి 1949 సం॥ డిసెం॥ 30 శుక్రవారం శు॥ దశమి ఉ 6-46 భర తె 6-29 వర్జ్యం ప 2-22 ల 4-10 కు.

శు॥ ఏకాదశి డిసెం॥ 31 శనివారం శు॥ ఏకాదశి ప 9-9 కృ 24-0 వర్జ్యం రా 7.41 ల 8-27 కు. వైకుంఠ ఏకాదశి

ఆంధ్రపత్రిక

విరోధి నం॥ పుష్య శు॥ దశమి

శుక్రవారం

## మెక్నాటన్ ప్రతిపాదనలు

కాశ్మీరు యుద్ధమునకు మూల కారణము లేమి ? ఇందుకు బాధ్యు లెవరు ? మొదలైన ప్రశ్నలకు సమాధానములను సాధించి బాధ్యు లెవరో నిర్ధారణ మైన తరువాత తీసుకొనదగు చర్య లేమిటో ముందుగ నిర్ధారణ చేసుకొనినగాని కాశ్మీర్ సమస్యా పరిష్కారము నకు ఎవరు ఎట్టి ప్రయత్నములు చేసినను అవి ఫలింపవని అనేక పర్యాయములు స్పష్టము చేసి యుంటిమి.

ఐక్యరాజ్యసమితి కాశ్మీర్ కమిషన్ యుద్ధవిరమణను సాధించి యుండవచ్చును. కాని అందువలన ఈ సమస్యా పరిష్కారము సుకరము కాలేదు. అంత్యలక్ష్యమును విస్మరించి తాత్కాలిక ప్రయోజనముల సాధననే ప్రధానముగ నెంచుటవలన సమితి కమిషన్ కార్యక్రమములో ప్రతిష్టంభన మేర్పడెను. భద్రతామండలి అధ్యక్షుడు మెక్నాటన్ కృషి విఫలమగుటకుకూడ ఇదే కారణము. ఏదో ఒకవిధముగ భారత-పాకిస్థాన్ పక్షములకు సమాధానము కుదుర్చుటకే మెక్నాటన్ తాపత్రయపడెను. వారి ప్రయత్నముల ఫలితముగ ఒడంబడిక కుదిరి యున్నప్పటికిని, 1948 ఆగస్టు 13-వ తేదీ కాశ్మీర్ కమిషన్ తీర్మానమునకు పట్టినగతే ఈఒడంబడికకు పట్టును.

కాశ్మీర్ సమస్య భారత, పాకిస్థాన్ వివాదముగాదు. ఈ యుద్ధమున భారతదేశము, పాకిస్థాన్ కక్షిదారులగుట కేవలము కాకతాళీయమే. పాకిస్థాన్ ప్రభుత్వము సరిహద్దు కొండజాతులవారిని కాశ్మీర్ యుద్ధమునకు ప్రోత్సహించియుండెను; యుద్ధము తీవ్రమగుటతో పాకిస్థాన్ తన సేనలనే కాశ్మీర్‌పైన యుద్ధమునకు పంపెను. కాశ్మీర్ సంస్థానము దురాక్రమణనుండి రక్షింపుమని భారత ప్రభుత్వ సహాయమునుఅర్థించెను. భారత ప్రభుత్వము సహాయము చేయుటకు వీలుగ సంస్థానాధీశ్వరుడు తన అధికారమును భారత ప్రభుత్వమునకు దఖలు పరచెను. అందువలన భారత ప్రభుత్వము కాశ్మీర్ సంస్థాన సంరక్షణా బాధ్యతను వహించెను. ఇవి కాశ్మీర్ యుద్ధపూర్వాపరములు. కాశ్మీరు కమిషన్ నివేదికలుకూడ ఈ విషయమును అంగీకరించెను. పాకిస్థాన్ కాశ్మీరుపై దురాక్రమణ జరిపినట్లు ఖచ్చితముగ తిన్నని చ్చుటకు ప్రయత్నించియుండలేదు; కాని 1947 అక్టోబరునుండి 1949 సెప్టెంబరు వరకు జరిగిన సంఘటనలను వివరించు కాశ్మీర్ కమిషన్ తయారు సిన నివేదికను నిష్పాక్షిక దృష్టితో పరిశీలించినవారందరికి పైన పేర్కొన్న యధార్థ చరిత్ర బోధపడగలదు.

భద్రతామండలి అధ్యక్షుడు మెక్నాటన్ చరిత్రను గుర్తింప లేదు. పాకిస్థాన్ దురాక్రమణ జరిపినట్లు గ్రహించియున్నను; అంగీకరింపలేదు. దురాక్రమణ జరిపిన పాకిస్థాన్ ప్రభుత్వమును, దురాక్రమణకు గురియైన భారత ప్రభుత్వమును సమానముగ పరిగణించెను. అందువలననే భారత ప్రభుత్వము కాశ్మీర్ కమిషన్ ప్రతిపాదనలను తిరస్కరించినట్లే, మెక్నాటన్ సూచనలను తిరస్కరించెను. కాశ్మీర్ సమస్యా పరిష్కారమునకు మార్గముల నన్వేషించువారి దృక్పథము మార్పు చెందనంతవరకు, ప్రయత్నించువారు మారినను, ప్రతిపాదనలు మారినను ఎట్టి ప్రయోజనము ఉండదు.

కాశ్మీర్ కమిషన్ ఆజాద్ కాశ్మీర్ సేనల ఉపసంహారము, సంస్థాన ఉత్తరప్రాంతముల రక్షణ విషయమునఎట్టిసూచనలుచేసెనో జనరల్ మెక్నాటన్ కూడా అట్టి సూచనలే చేసియుండెను. భారత, పాకిస్థాన్ సేనల ఉపసంహారము ఒకేవిధముగ జరుగవలెనని వీరు వాదించిరి. ఉత్తర ప్రాంతముల రక్షణ బాధ్యతను భారతప్రభుత్వము వహింప నవసరము లేదని సూచించెను. కాశ్మీర్ కమిషన్ తొలి నివేదికాంశములకు మెక్నాటన్ సూచనలు పూర్తిగ విరుద్ధము గనున్నవి. కనుకనే భారతప్రభుత్వము విచారణలేక మొత్తముగ తిరస్కరించెను. కాశ్మీర్ కమిషన్ గాని, మెక్నాటన్‌గాని ఇట్టి పక్షపాత పూరితమైన సూచనలు చేయుటకు చాలవరకు భారత ప్రభుత్వ సమాధానవైఖరే కారణము. హైదరాబాద్ సంస్థానవిషయములోవలెనే ఖచ్చితమైనవైఖరిని అవలంబించకున్న ఈ సమస్య ఎన్నటికి పరిష్కారముగాదు.

## జనవరి 26 కు ఆంధ్ర రాష్ట్రావతరణ

### ఆటంకాలు కలిగించడానికి ఢిల్లీలోని మహారాష్ట్ర కన్నడిగల ప్రయత్నాలు

['ఆంధ్రపత్రిక' విలేఖరి]

బొంబాయి, డిసెంబరు 28 :— ఢిల్లీలో ఉన్న కన్నడిగలు, మహారాష్ట్రులు, బళ్లారిజిల్లా వారు కలసి, ఆంధ్ర రాష్ట్రానికి అడ్డంకులు కల్పించడానికి ప్రయత్నిస్తున్నారని తెలుస్తున్నది. జనవరి 26 వ తేదీకి ఆంధ్రరాష్ట్రం రాకపోతే అసలు ఆంధ్రరాష్ట్రం రావడమే ఆలస్యం కావచ్చునట. అయినా కొందరు కాంగ్రెసు వారు జనవరి 26 వ తేదీనాటికి ఆంధ్రరాష్ట్రం నిర్మింప బడగలదని భావిస్తున్నారు. అలాగయినపక్షంలో, మిగిలిన భాషా రాష్ట్రాలుకూడా క్రమంగా ఏర్పడగలవని వీరి అభిప్రాయము.

బళ్లారిజిల్లా అంతా కర్ణాటకంలో చేరాలని అంటున్న కర్ణాటక రాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షులు నిజలింగప్పగారి వాక్యాలు అతిశయోక్తులతో నిండిఉన్నవని బొంబాయిలోని కన్నడిగలు కూడా అనుకొంటున్నారు.

మహారాష్ట్రానికి కూడా ప్రత్యేక రాష్ట్రం కావాలన్న వాదానికి క్రమంగా బలం చేకూరుతున్నట్లు తెలుస్తున్నది. బొంబాయిని మహారాష్ట్రంలో చేర్చాలని వివాదాలు చేస్తూ వేలకొలది మహారాష్ట్రులు సభలలో ప్రదర్శనాలు జరుపుతున్నారు.

కొత్త ఆర్థిక సంవత్సర ప్రారంభం నించి బొంబాయి పరిసరాలను బొంబాయిలో కలిపి వెయ్యాలని అధికారులు ప్రయత్నిస్తున్నట్లు తెలుస్తున్నది. చేరాలు వివాదంలో బొంబాయి పరిసరాలను చాలా వరకు బొంబాయిలో కలిపి నూతనంగా అప్పుడే ప్రకటించారని తెలుస్తున్నది.

## ఇండియా-పాకిస్థాన్ ద్రవ్యమారకపు తగాదా

### సంప్రదింపులకు పాకిస్థాన్ సంసిద్ధత

కరాచీ, డిసెంబర్ 28 : ఇండియాతో పాటుగా పాకిస్థాన్ తనరూపాయి విలువను తగ్గించుకొనకుండా ఏర్పాటు చేసిన కొత్తమారకపు రేట్లను ఇండియా ఆమోదించనందువల్ల పాకిస్థాన్ ప్రభుత్వానికి కలిగిన కష్టాన్ని గురించి పాకిస్థాన్ ఆర్థిక మంత్రి గులాం మహమ్మద్ నేడు పార్లమెంటులో వెల్లడించాడు. ఈ ప్రతిష్టంభన అంతంకావాలని తమ ప్రభుత్వం వాంఛిస్తున్నదనీ వివిధాంశాలమీదనూ సంప్రదించటానికి తమ సంసిద్ధతను భారత ప్రభుత్వానికి తెలియజేశామనీ ఆయన వెల్లడించాడు.

"అయితే జరిగే సంప్రదింపులన్నీ పాకిస్థాన్ రూపాయి మారకపు రేటు విషయమై మేమునిర్ణయించుకున్న స్థూలవిధానానికి భిన్నంగా జరగకూడదని మేము భారత ప్రభుత్వానికి స్పష్టపరిచాము. పాకిస్థాన్ రూపాయిరేటు విషయమై సమావేశంలో చర్చించటానికి వీలులేదు.

ఇటీవల భారతప్రధాని రాజ్యాంగ పరిషత్తులో ప్రసంగిస్తూ తమ ప్రభుత్వం ఒప్పందానికి సిద్ధంగా ఉన్నప్పటికీ పాకిస్థాన్ ఏమీ మాట్లాడలేదని అన్నట్లు తెలిసినది. కాని ఆయన ప్రసంగించటానికి ముందే ద్రవ్య విమూల్యకరణ సమస్యకు సంబంధించిన వివిధాంశాలనూ చర్చింటానికై అంతరంగిక సమావేశం జరపాలని నేను భారత ఆర్థికమంత్రికి సూచించాను. సమావేశంలో పాల్గొనటానికి అంగీకరిస్తూ భారత ప్రభుత్వం మాకు తెలియజేసినది" అని అతడు వివరించాడు.

ఇతర ప్రశ్నలకు సమాధానమిస్తూ ఆతడీ క్రింది అంశాలు తెలియజేశాడు.

"సెప్టెంబర్ 19 వ తేదీన ఇండియా రూపాయివిలువ తగ్గించుకున్నది. ఆ నెల మొదటినుంచీ అప్పటివరకూ ఇండియా పాకిస్థానుకు ఇవ్వవలసిన డబ్బును ఇండియా చెల్లించలేదు. దాని విషయమై సంప్రదింపులు జరుగుతున్నవి.

ఇండియా పాకిస్థాన్‌ల మధ్య జరిగే వ్యాపారం ఎప్పుడూ పాకిస్థానుకే అనుకూలంగా ఉంటున్నది.

ద్రవ్య విమూల్యకరణం జరిగినందువల్ల ఇండియా పాకిస్థాన్‌ల పోస్టాఫీసుల్లో ఒకచోటనుంచి మరొకచోటికి వెళ్లవలసిన మనీ-ఆర్డర్లు నిలిపి వేయబడినవి. విమూల్యకరణానికి ముందున్న రేట్లనుబట్టి తమ దేశానికి పంపబడ్డ మనిఆర్డర్లను చెల్లించమని భారత ప్రభుత్వం ఈ తిరుపుచేసినట్లు పత్రికలు ప్రకటించినవి. అదేవిధంగా పాకిస్థాన్‌లో వాళ్లకుకూడా పాకిస్థాన్ డబ్బులో మనిఆర్డర్లు చెల్లిస్తే ఇండియా ఆడబ్బును పాకిస్థాన్ డబ్బులో చెల్లిస్తుందా అని మేము భారత ప్రభుత్వాన్ని అడిగాము. తాను తన సొంత డబ్బులోనే చెల్లిస్తానని భారత ప్రభుత్వం ప్రకటించింది."

## పాకిస్థాన్ విదేశ వ్యాపారం

"సముద్రమార్గాన జరిగే విదేశ వ్యాపారంలో, కడచిన 28 నెలలలోనూ, పాకిస్థాన్ 5 కోట్ల రూపాయిలకు లోటుగానే ఇవ్వ తేలినది. కాని భూమార్గంమీద జరిగిన వ్యాపారం పాకిస్థానుకు ఎంతో అనుకూలంగా ఉన్నది. ఇదివరకు ఇండియాకు చేస్తున్న ఎగుమతులు ఇప్పుడు ఇతర దేశాలకు పంపబడుతున్నవి. ఇండియా జనుము కొననందువల్ల నరలేమీ పడిపోలేదు." అని వాణిజ్యమంత్రి ఫజ్లుర్ రహమాన్ ఒక ప్రశ్నకు సమాధానమిస్తూ వివరించాడు.

ప్రీవీకౌన్సిలు సివిల్ అపీళ్ళను పంపే పద్ధతిని రద్దుచేస్తూ ఒకబిలునూ, క్రిమినల్ వ్యవహారాల్లో అమెరికనలకూ, యూరపియన్లకూ ఉన్న ప్రత్యేక సౌకర్యాలను రద్దుచేస్తూ మరొకబిల్లును న్యాయశాఖామంత్రి జోగేంద్రనాథ్ మండల్ ప్రతిపాదించగా పార్లమెంటు ఆమోదించింది.

## ఉద్యోగవార్తలు

మదరాసు, డిసెంబరు 28: శ్రీమతి గౌరికాంతమ్మను గుంటూరు ప్రభుత్వ స్త్రీల కళాశాల ప్రిన్సిపాల్ లెక్చరర్‌గ నియమించబడిరి.

హైదరాబాద్‌లో డిప్యూటీ సివిల్ పరిపాలకుడుగావుండిన డిప్యూటీ కలెక్టరు శ్రీ యస్. మాగంటి తుంగభద్ర ప్రాజక్టు స్పెషల్ ఆఫీసర్‌కు పునరావాస స్పెషల్ అసిస్టెంటుగా నియమించబడిరి

కృష్ణాజిల్లా జడ్జి సయ్యద్ ఇమాము ద్దీనుకు 1950 జనవరి 3 నుండి 2 నెలలు శెలవొసగిరి.

శెలవులోవున్న ఎబ్బూ ఎబ్బూ జాన్సన్ పనిలో చేరుటకు అనుమతిచ్చి శ్రీ యం. కన్నబాబుని బదులు బళ్లారిజిల్లా జడ్జిగ నియమించిరి.

శ్రీ యం. కన్నబాబు కృష్ణాజిల్లా జడ్జి నియమించిరి.

## శాంతివాదుల మహాసభ

సేవాగ్రామ్, డిసెంబరు 28: ప్రపంచ శాంతివాదుల మహాసభలో ఈవేళ జరిగిన చర్చల గురించి అధికారరీత్యా ఇట్లు ప్రకటన చేయబడెను:

"ఇండియా పాకిస్థానమధ్య శాంతి సామరస్యాలు కుదర్చడానికై కృషి చేస్తున్నవారు ఎరుగూ కలసిన చిక్కులను హవార్డ్ విశ్వ విద్యాలయం (వాషింగ్టన్) నీగ్రో అధ్యక్షుడైన డా॥ మోర్డెకాయ్ జాన్సన్‌గారు కళ్లకు కట్టేట్లు వర్ణించి, సోదరులమధ్యకూడా ఇటువంటి కలహాలు రావడం సహజమనీ, ఇండియా పాకిస్థాన్లు ఈ కుటుంబ కలహాలను బైటికి పొక్కనివ్వకుండా భ్రాతృభావంతో సర్దుకోవాలనీ, విజ్ఞప్తి చేసిరి. నిజజాతియొక్క కష్టసుఖాలతో పరిపూర్ణ తాదాత్మ్యం ఘటింపజేసుకున్న ఈవ్యక్తికి నిఖిల మానవజాతులతో సహానుభూతి సాధించగల సహృదయతఉన్నది. తాత్కాలిక సమస్యలతో పతనులమైపోయి అసలు విషయాలను మరచి పోకూడదనీ, మన స్సును ప్రశాంత మొనర్చుకొని నిశ్చల ధ్యానబుద్ధితో సమస్యలకు పరిష్కార మార్గాలను అన్వేషించవలెననీ, ఆయన ఉద్బోధించెను.

ఢక్కా విశ్వవిద్యాలయంలో ఫిజిక్సు ప్రొఫెసరుగా ఉన్న కె. ఎమ్. హుస్సేన్ గారు మాట్లాడుతూ, తూర్పు పాకిస్థాన్ నుంచి వచ్చిన జితేంద్రనాథ్ కుసారి వెల్లడించిన అభిప్రాయముల బలపరచెను. ఇండియాలోని ముస్లింలయెడ స్నేహసద్భావలను ప్రదర్శించాలని రాజకుమారి అమృత్ కౌర్ అన్నమాటలను ఆయన పునరావృత్తం చేసెను. అధికారంకోసం వెంపర్లాడుతున్న కొన్నివర్గాలు ఇండియా పాకిస్థాన్లకు పోట్లాటలు పెడుతున్నారనీ ప్రజల్లో ప్రజలకు ఏలాంటి తగవులు లేవనీ ఆయన అన్నాడు. భారతజాతీయ కాంగ్రెసు మతపక్షపాత రహితంగా ఉండడానికి ప్రయత్నిస్తున్నదనీ, ఇది చాలా ప్రశంసనీయమనీ ఆయన అభినందించెను. అటుపిమ్మట ప్యారేలాల్ గారు మాట్లాడుతూ, పశ్చిమ బెంగాలులోను తూర్పు బెంగాలులోనూ గ్రామాలలో హిందువులకు ముస్లింలకు కలహాలు లేవనీ, కొన్ని బహిఃశక్తుల ప్రేరణ ఈ కలహాలన్నిటికీ కారణమనీ చెప్పిరి.

శ్రీ కె. జి. మష్రువాలాగారు ఉపన్యసిస్తూ, భారతదేశానికి పేర సంపన్నులకు పరమశులమైన పరిత్యాగం చేసుకోగల హృదయమైశాల్యత వున్నదన్నారు.

### డా॥ రాజేంద్రప్రసాద్ ఉపన్యాసం

డా॥ రాజేంద్రప్రసాద్‌గారు నేటి సమావేశంలో ఉపన్యసిస్తూ, భారత దేశాన్ని విభాగించడానికి కాంగ్రెసు గత్యంతరంలేక అంగీకరించవలసి వచ్చిందనీ, పశ్చిమ పాకిస్థాన్‌నుండి ముస్లిమేతరులు తూర్పుపంజాబునుండి ముస్లింలు నిశ్శేషంగా వెడలగొట్టబడడం శోచనీయమనీ అన్నారు. ప్రస్తుతం హిందూ ముస్లింల మధ్య వైమనస్యానికి నాలుగు ప్రధాన కారణాలున్నవని ప్రసాద్ గారు చెప్పిరి-అవి ఏవంటే, ఒకటి దేశాంతరగతులైన ముస్లిం కాందిశీకుల ఆస్తులకన్న హిందూ కాందిశీకుల ఆస్తుల విలువ అధికం; రెండు, కాశ్మీర్ సమస్య; మూడు స్త్రీల అపహరణ; నాలుగు ఇండియా పాకిస్థాన్లకు ఆర్థికవిషయాలలోవచ్చిన తగాదాలు.

ఉభయపక్షాలకు చెందని పరదేశీయులు అసలు సంగతులను అవగాహన చేసుకొని రాజీ కుదర్చడానికి ప్రయత్నిస్తే మేలు కలగడానికి అవకాశం వున్నది అని ఆయన అన్నారు. సభా నేటి ప్రపంచ శాంతి సామరస్యాలకై మౌన ప్రార్థనతో నిశ్శబ్దంగా ముగిసింది.

## బ్రిటనుకు అమెరికా ఆయుధాల సరఫరా

### ఒప్పందంపై చర్చలకు బ్రిటను సంసిద్ధత

వాషింగ్టను, డిసెంబరు 28 : యూరపు రాజ్యాలకు అమెరికా అందించే ఆయుధాలలో తమ వాటాగురించి అమెరికాతో పరస్పర ఒడంబడిక చేసుకోవడానికి గాను చర్చలు జరపడానికి బ్రిటను ఒప్పుకొన్నదట

బ్రిటిష్ అమెరికను అధికార్ల మధ్య అనేక వారాలుగా జరుగుతూ ఉండిన సంప్రతింపులు ఈ నిర్ణయంతో ముగిసినవి. అమెరికా ప్రభుత్వశాఖవారు తయారుచేసిన కొన్ని నిబంధనలు తనకు సమ్మతం కాక బ్రిటన తనకు అమెరికా నుంచి ఆయుధాల సహాయం అవసరం లేదని కూడా ఒక సమయంలో అన్నది ఒకెం డికర ప్రాతిపదికగా అమెరికా వేసిన కొత్తసూచనలను బ్రిటన్ ఇప్పుడు ఆమోదిస్తున్నది బ్రిటన్ చర్చలు సాగించడానికి సిద్ధంగా వున్నదని అమెరికా బ్రిటీషు రాయబారి సర్ ఆలివర్ ఫ్రాంక్సు కు తెలియజేసింది

## ఇండొనీషియాకు అమెరికా పరిగణన

### రాయబారి నియామకం: ఆర్థిక సహాయానికి హామీ

వాషింగ్టన్, డిసెంబరు 28:—అమెరికా ఈవేళ కొత్త ఇండొనీషియా ప్రభుత్వాన్ని గుర్తించినట్లు ప్రకటించినట్లు ప్రకటించింది. హొచ్ మెర్లి కొక్రాను ఇండొనీషియాలో మొట్టమొదటి అమెరికా రాయబారిగా నియమింప బడ్డారు. కొక్రాను అప్పుడే తన అధికార చిహ్నాలను ఇండొనీషియా ప్రభుత్వానికి అందించారని అమెరికా ఈవేళ అధికారరీత్యా ప్రకటించింది.

ఈ కొక్రాను ఇండొనీషియా విషయంలో ఏర్పరచబడిన ఐక్యరాజ్య సమితి ప్రత్యేక సంఘంలో సభ్యులుగా ఉండి, ఇండొనీషియాలో రిపబ్లిక్ అవతరణకు ఎక్కువగా తోడ్పడ్డారని తెలుస్తున్నది.

ఈయన ఐక్యరాజ్య సమితి సంఘంలోని తన సభ్యత్వం వదులుకున్నారనీ, ఇంతకు పూర్వం ఉండిన పాకిస్థాను రాయబారి ఉద్యోగంకూడా వదులుకున్నారనీ తెలుస్తున్నది.

కొత్త రిపబ్లికు సహాయం కావాలని అడిగితే, ఆర్థికంగా సహాయం చెయ్యడానికి తగిన చర్యలన్నీ అప్పుడే అమెరికా తీసికొంటున్నదని కూడా తెలుస్తున్నది

ఇన్నాళ్ళ నించీ ఇండొనీషియా పాలెండు రాజ్యంలో అంతర్భాగంగా మార్షలు సహాయం తీసుకొంటున్నది. ఇండొనీషియాకు అధికార ప్రదానం జరిగింది కనక ఇంక జరిగే సహాయం ఈ విధంగా జరగదని తెలుస్తున్నది

ఇండొనీషియా అమెరికాల మధ్య వాణిజ్య, ఆర్థికసహాయ, మిత్రత్వసంధులు త్వరలోనే ఏర్పడగలవని ఇక్కడి అధికారవర్గాలవారు భావిస్తున్నారు.

ఇలాంటి సంధి ఒకటి ఇంతకుపూర్వం ఉరుగ్వేకు అమెరికాకు మధ్యన జరిగింది, ఈ ఒడంబడికలో అమెరికా పెట్టుబడులపై ప్రత్యేకమైన ఆంక్షలేమీ విధింపబడకూడదని ఉన్నది. ఇండొనీషియాతో కూడా ఇలాంటి సంధిఒడంబడిక చేసుకోవడంవల్ల ఇండొనీషియాలో అమెరికా డాలర్ల పెట్టుబడికి ఎక్కువ అవకాశం ఉండగలదని భావింపబడుతున్నది.

అధ్యక్షుడు ట్రూమను చతుర్థసూత్ర ప్రణాళిక కాంగ్రెసులో ఆమోదింపబడితే ఇండొనీషియా దానిలో భాగస్వామిగా ఉండగలదని తెలుస్తున్నది.

అమెరికా ప్రభుత్వ కార్యదర్శి, ఇండొనీషియాకు అమెరికా అభినందనలు పంపిస్తూ, అవసరమైతే అమెరికా ఆర్థిక సహాయం చేయగలదని తెలియజేశారట.

### ఇతరదేశాల పరిగణన

జాతీయ చైనా ప్రభుత్వం ఇండొనీషియాను స్వతంత్రంగా గుర్తించినదనీ, రాయబారుల మార్పు జరగగలదనీ జాతీయ చైనా రాయబారి డాక్టరు యే ఈవేళ ప్రకటించారు.

అలాగే బెల్జియంకూడా ఇండొనీషియాను గుర్తించింది. ఇండొనీషియా ప్రజలకు అభినందనలుకూడా పంపించింది.

బర్మా, ఐర్లాండు ప్రభుత్వాలుకూడా, ఇండొనీషియాను గుర్తించి, ఇండొనీషియా ప్రజలకు అభినందన సందేశాలు పంపించాయి.

ఇండొనీసియాకు పోర్చుగీసు పరిగణన

లిస్బన్, డిసెంబరు 28 : పోర్చుగీసు ప్రభుత్వం ఈవేళ రాత్రి ఇండొనీసియా సంయుక్త రాష్ట్రాలను లాంఛనంగా గుర్తించింది

## బీబీనగర్ కేసు ప్రాసిక్యూషన్ ప్రథమసాక్షి

### అచ్చయ్యక్రాసుపరీక్ష ముగింపు

సికందరాబాదు, డిసెంబర్ 28 : బీబీ నగర్ కేసును విచారిస్తున్న ప్రత్యేక న్యాయవిచారణసంఘం నేడు ప్రాసిక్యూషన్ ప్రథమసాక్షి అచ్చయ్యకు క్రాసు పరీక్ష చేయడం ముగించారు. సాక్షి తన సాక్ష్యంలో ఇట్లా చెప్పాడు. బల్లయ్య, రాజయ్యల థోవతులకు నెత్తురు మరకలైనవి. పంచనామా తయారుచేసిన సి. ఐ. డి. ఇన్స్పెక్టరు నెత్తురు మరకలైన దుస్తులను రజాకారు గతుల పెట్టారన్న విషయం అందులో పేర్కొనడానికి నిరాకరించాడు.

ప్రశ్న రజాకార్ల నినాదాలు విన్నప్పుడు నీకు కష్టం వేసిందా?

సమాధానం: ఎట్లాచెప్పగలను? ఉత్సాహంతోనే మహాత్మాగాంధీకి జై అని నేనూ నినాదం చేశాను.

ప్ర: నువ్వట్లా నినాదంచేసింది కోపంతోనేనా ? న్యాయ విచారణ సంఘ అధ్యక్షుడు పింటో ఈ ప్రశ్న వ్యాఖ్యగా వున్నదంటూ దానిని వేయరాదన్నాడు.

తర్వాత సాక్షి ఇట్లా చెప్పాడు. మరి కొందరు వాకులతో నేను చంచలగుడా జైలులో పలుకురు ముస్లిములను గుర్తించాను.

## కమ్యూనిస్టులకు మిలిటరీకి సాయుధ సంఘర్షణ

### ఒకరి మరణం ముగ్గురికి గాయాలు

సికిందరాబాదు, డిసెంబరు 28 : బాజార్ నగర్ తాలూకా, యత్తవాకిళ్ల గ్రామం వద్ద డిసెంబరు 23 వ తేదీన 30 మంది సాయుధ కమ్యూనిస్టులకు, సంస్థాన మిలిటరీకి తీవ్ర సంఘర్షణ జరిగిందనీ, తత్ఫలితంగా ఒక కమ్యూనిస్టు మరణించాడనీ ముగ్గురు గాయపడ్డారనీ, ఇక్కడి ఆంధ్ర రాష్ట్రీయ కాంగ్రెసు కార్యాలయానికి ఒక వార్త చేరినది.

యత్తవాకిళ్ల గ్రామ పట్వారి నుండి ధాన్యం లూటీచేయటానికై 30 మంది సాయుధ కమ్యూనిస్టులు దాడి చేశారనీ, ఈ లోగా దైవవశాత్తు అక్కడికి వచ్చిన మిలిటరీ వారు కమ్యూనిస్టుల దుండగం చూసి వారితో తలపడ్డారనీ, తత్ఫలితంగా ఒక కమ్యూనిస్టు మరణించటం, తీవ్రంగా గాయపడటం జరిగిందనీ, గాయపడిన ముగ్గురిని కమ్యూనిస్టులు తీసుకు పోయారనీ, చనిపోయిన వాని శవమును మాత్రం మిలిటరీ వారు తెచ్చారనీ తెలుస్తున్నది

## హైద్రాబాదు-మద్రాసు అధికారుల సమావేశం

### కమ్యూనిస్టు అల్లరుల గురించి సంప్రదింపులు

మదరాసు, డిసెంబరు 29: శాంతిభద్రతలు కాపాడే విషయమున తరచు తరచుగ జరుగు హైదరాబాదు-మదరాసు ఉన్నతోద్యోగుల సంప్రదింపుల సభ నేడు మదరాసు కోటలో 11 గంటలకు జరిగెను. ఇండియా ప్రభుత్వం హోము కార్యదర్శి హెచ్. వి. ఆర్. అయ్యంగారు, హైదరాబాదు పాలకుడు ఎం. కె. వెల్లోడి, మదరాసు ప్రధాని, ప్రధాన కార్యదర్శి, హోము కార్యదర్శి, ఉభయ ప్రభుత్వాల పోలీసు అధికారులు, కొన్ని జిల్లాల సూపర్నెంటులు మున్నగు ఉద్యోగులు చర్చలలో పాల్గొనిరి. 1 గంటకు సభ ముగిసెను.

## హైదరాబాదు ఓటర్ల జాబితాలు

### 14 క్రొత్త దరఖాస్తులు, 3 అభ్యంతరాలు

హైదరాబాదు, డిసెంబరు 28: ఈ నెల 3 వ తేదీన హైదరాబాదు ప్రభుత్వం ప్రకటించిన ఓటర్ల జాబితా ముసాయిదాకు ఇప్పటివరకు 14 క్రొత్త దరఖాస్తులు, 3 అభ్యంతరాలు ఎన్నికల కమీషనర్ కార్యాలయానికి చేరినవని నేడు తెలిసినది.

క్రొత్త దరఖాస్తులు, అభ్యంతరాలు ముసాయిదా ప్రకటింపబడిన నెలరోజుల గడువులోగా పంపుకోవలసియున్నది.

హైదరాబాదు రాజ్యాంగ పరిషత్తుకు ఎన్నికలు వచ్చే మార్చి 8 వ తేదీన జరుగుతాయి దాదాపు 90 లక్షల మంది వయోజనులు వోటుచేస్తారని భావింపబడుతున్నది

## జాగీర్దార్లకు పరిహారం

### హైదరాబాదులో చర్చలు

హైదరాబాదు, డిసెంబరు 28: హైదరాబాదు ప్రభుత్వమందలి ఉన్నతాధికారులకు, సంస్థానంలోని జాగీర్దార్లకు నేటి ఉదయం సూరుంజిల్‌లో సమావేశం జరిగినది. ఈ ఏడాది ఆగస్టు 15 వ ప్రభుత్వం వశపరచుకున్న జాగీర్లకు పరిహారమిచ్చే విషయమై సంభాషణలు జరిగినవని తెలుస్తున్నది. ఈ విషయమై తమ అభిప్రాయములను తెలుపుటకు జాగీర్దార్లకు కొంత గడువు ఇవ్వబడినదనికూడా తెలుస్తున్నది. చర్చలు ఒకగంటసేపు సాగినవి. చర్చలలో ముఖ్యమంత్రి ఎమ్. కె. వెల్లోడి, రివిన్యూ మంత్రి ఎమ్. శేషాద్రి, జాగీర్ పరిపాలకుడు ఎల్. ఎన్. గుప్తగార్లు పాల్గొన్నారు.

తుపాను బాధితులకు సహాయం

మదరాసు, డిసెంబరు 28 : కర్నూలు జిల్లాలో వరద బాధితులకు సహాయము నిమిత్తము ప్రభుత్వము రు 23000/- లకు మించకుండా అదనపు మొత్తమును మంజూరు చేసెను.

తిరుత్తని సుబ్రహ్మణ్యస్వామి కృత్తిక తిరుపుగలు భజన ఉత్సవాలకు డిసెంబరు 31వ తేదీన ఉదయం 6-13 గ. 8గ స్పెషలు రైళ్ళను మదరాసునుంచి తిరుత్తణికి నడిపింపబడును. అవలు 7-42గ 9-20గ. రేపు తిరుత్తణిని జనవరి 1వ తేదీ ఉదయం 6-10గ, 8-45గ తిరుత్తణిలో బయలుదేరును

త్యాగరాజస్వామి ఆరాధనోత్సవము (103 వార్షికోత్సవం) తంజావూరు జిల్లాలో తిరువైయారు జనవరి 13 వ తేదీ వరకు జరుగును.

## పాకిస్థాన్ ఆటంకం

(1-వ పేజీ తరువాయి)

పాకిస్థానే అస్సాము నుంచి పశ్చిమ బెంగాలుకు సరుకులు రాకుండా చేసి అంతర్జాతీయ ఒప్పందాలను ఉల్లంఘించి నదనీ వీరు ఆరోపిస్తున్నారు. పశ్చిమ బెంగాల్-అస్సాం రవాణాను పాకిస్థాన్ అటకాయించటంవల్ల యెక్కువగా దెబ్బ తిన్నది తేయాకు.

## పాకిస్థాన్‌కు ఇండియా కరెన్సీ ఎగుమతి నిషేధం

న్యూఢిల్లీ, డిసెంబర్ 29: పాకిస్థానుకు యీదేశంనుంచి కరెన్సీ నోటును పంపబం నేరమని భారత ప్రభుత్వం నేడొక ప్రకటన చేసినది. అనిషంగా పంపబడే నోట్లను స్వాధీనపరచుకొనటమే కాక, అవిధంగా పంపేవారికి 2 సం॥ఖైదు, 500 రూ॥ల వరకూ జరిమానా విధించబడగలదని ఆ ప్రకటన తెలియజేస్తున్నది.

ప్రభుత్వ ప్రకటన యీ కింది విధంగా ఉన్నది.

"నియమాలకు విరుద్ధంగా, నిషేధించబడిన కరెన్సీనోట్లను తపాలాబంగీలలో పెట్టి పాకిస్థానుకు పంపటానికి ప్రయత్నాలు జరుగుతున్నవి. అవిధంగా నోటును పాకిస్థానుకు పంపటం 'విదేశ ద్రవ్యమార్పిడి' శాసనాన్ని ఉల్లంఘించటమే. దీనిని ఉల్లంఘించినవారికి 2 సం॥ వరకూ ఖైదునూ, 500 రూ॥ల వరకూ జరిమానానూ, లేక రెంటినీ వేయవచ్చును. నోట్లు స్వాధీనం చేసుకోబడును. ఆతిథి తపాలా చట్టాన్ని పట్టికూడా 2సం॥ఖైదూ, 500 రూ॥ల వరకు జరిమానా విధించు వీలుకలుగుతున్నది."

## భీమా చట్టసవరణ బిల్లు అమలు

1-వ పేజీ తరువాయి

వాయిదావేశారు. అంచుచేత ప్రభుత్వం వారు తమ తొలినిర్ణయానుసారం భీమా బిల్లులోని అంశాలు జనవరి 1 నుంచిఅమలుచేసే తలంపుతో పైన చెప్పినట్లు ఆర్డినెన్సు జారీచేస్తారట.

## ప్రభుత్వశాఖల పంపిణీపై చర్చ

ప్రభుత్వశాఖల పంపిణీగురించిన గోపాలస్వామి అయ్యంగారు పథకంపై చర్చలు జరపడానికి కేంద్ర కాబినెటువారు నిన్నటినుంచి సమావేశమవుతున్నారట. సమావేశం మూడురోజులు జరుగుతుంది. గోపాలస్వామి అయ్యంగారు పథకంలో కొన్ని సవరణలు జరిగితే గాని ఆమోదించవీలుపడదనే సూచనలున్నవి. ప్రభుత్వంవారు ఖర్చు తగ్గించుకోవాలని ఉన్నది. కొత్త సంపదీజాతులు లోటుకు దారితీయరాదు. కాబినెటు బంగ్రులు పదిమంది ప్రైవేటు ఉండే పథకంలో సూచించబడిన "బ్యూరో" విధానం సాధ్యంకాదు. అటువంటి పరిస్థితిలో ప్రధాని మంత్రివర్గాన్ని మార్చడానికుంటుంది. తుదినిర్ణయం వారాంతానికి జరుగవచ్చు.

## ఎస్టేట్లకు నష్టపరిహారం వాయిదాల నిర్ణయించి ప్రభుత్వ ప్రకటన

మదరాసు, డిసెంబరు 29 : ఎస్టేట్లరద్దు చట్టము క్రింద చేయబడిన నిబంధనలను ప్రభుత్వము ప్రకటించెను.

ఇటీవల శాసనసభ ఆమోదము పొందిన ఈ నిబంధనల ననుసరించి ప్రతి ఎస్టేటుకు చెల్లించవలసిన పరిహారమునకుగుదులో ఇచ్చెదరు. మత దానధర్మ సంస్థలకు ప్రకటన తేదీకి పూర్వము చెందని ఎస్టేట్ల ప్రాతిపదిక మొత్తము రు 3000లకు మించని యెడల పరిహారము ఏక మొత్తముగా చెల్లించెదరు. ఎస్టేటుకు చెల్లించవలసిన ప్రాతిపదిక మొత్తము 3 వేలకు మించి 50 వేలకు దాటని ఎడల మూడు వాయిదాలలోనూ పరిహార మొత్తము రు 50 వేలకు మించిన అయిదుకు మించని వాయిదాలలోనూ పరిహారమిచ్చెదరు.

ఏక మొత్తముగా చెల్లించు మొత్తము గాని వాయిదా బందీని చెల్లించునప్పుడు మొదటి వాయిదా మొత్తముగాని ఎస్టేటు సెటిల్‌మెంటు పనిపూర్తి అయిన దరిమిలా 6 నెలలకు మించకుండగ గాని అంతకు ముందు అయినచో ఫసలీ 30 లేక 34 లో ఉదహరించినట్లు మూడు ఫసలీ సంవత్సరములకుమిలా 3 నెలలకు మించకుండగనూ చెల్లించెదరు.

మొదటి వాయిదా నాటికి చెల్లింపబడక మిగిలిన మొత్తమునకు వడ్డీ ఇచ్చు పద్ధతి కూడ ఏర్పరిచిరి.

ఈ నియమములు 1949 ఏప్రిల్ 19 నుండి అమలులోనికి వచ్చెను.

## ఎస్. ఎ. డి. పరీక్షా ఫలితాలు

వాల్తేరు, డిసెంబరు 27 : 9,9 డిసెంబరులో జరిగిన ఎస్. ఎ. డి. పరీక్షలో ఉత్తీర్ణులైనవారి నంబరు తాత్కాలిక జాబితా :

బ్రాంచి i 373

బ్రాంచి ii 374

బ్రాంచి iii —

బ్రాంచి iv —



• • శేదోక్తంగా గౌ॥ శ్రీ మంత్రి భక్తవత్సలంగారు ఉప్పుటేరు బ్రిడ్జి శంకుస్థాపన చేసే దృశ్యం.

# 'ప్రజాహితమే పరమాశయంగా ప్రతివారూ ప్రవర్తించాలి'

## పబ్లిక్‌వర్క్స్ మంత్రి భక్తవత్సలం ఉద్బోధ

### ఉప్పుటేరు వంతెన శంకుస్థాపనోత్సవ వివరాలు

(స్వకీయ విలేఖరి)

గుడివాడ, డిసెంబర్ 27: "జనవరి 26-వ తేదీనుంచీ మనం నిజమైన స్వాతంత్ర్యంస్థితిననుభవించుతాము. అప్పటినుంచే మన అభివృద్ధి ప్రణాళికలు ఆటంకాలు లేకుండా కొనసాగుతాయి. అయితే మన మంతా ఇకముందు క్రమశిక్షణతో, ప్రజాహిత దృష్టితో ప్రవర్తించాలి. ప్రభుత్వము ప్రజ ఒకటే నన్నది దృష్టిలోనుంచుకొని ఆర్థికస్థితి, సాధ్యాసాధ్యములు, గమనించి కోరికలు కోరుతూ, కార్యసాధనకు కడంగాలి" అని పబ్లిక్‌వర్క్స్ మంత్రి గౌ॥ ఎం. భక్తవత్సలంగారు నిన్న ఉప్పుటేరుపై వంతెన నిర్మాణమునకు శంఖుస్థాపన చేయుచు నుడివిరి.

మంత్రిగారు పశ్చిమ గోదావరిజిల్లా పర్యటనం ముగించుకొని మాగంటి బాపినీడు, సీతారామదాసు, వేముల కూర్మయ్య, అల్లూరి సత్యనారాయణరాజు, పి. డబ్ల్యు. డి. సూపరింటెండింగ్ ఇంజనీరు, హైవేస్ సూపరింటెండింగ్ ఇంజనీరు జనాబ్ ఎన్. దురానిగార్లతో కలిసి వచ్చిరి. కృష్ణాజిల్లాబోర్డు అధ్యక్షుడు కాకాని వెంకటరత్నం, తా॥ కృష్ణాజిల్లా కాం॥ అధ్యక్షుడుమాగంటిఅంకినీడు,శాసన సభ్యులు వల్లభనేని సీతారామలక్ష్మమ్మ, కొల్లిపర సూరయ్య, కైకలూరు తాలూకా కాం॥ స్పెషల్ ఆఫీసరు రాజనాల సుబ్బారావు, గుడివాడ రామచంద్రరావు, కొజ ఉమామహేశ్వరరావు, కృష్ణాజిల్లా హైవేస్ డివిజనల్ ఇంజనీరు హనమా కామోజీరావు, గుడివాడ అసిస్టెంటు ఇంజనీరు సూరంపూడి కనకరాజు, పేట బాయ్య ప్రభృతులు. వీరికి ఉప్పుటేరుకద్ద స్వాగతమిచ్చిరి. మంగళవాద్య యంత్రములు అమర్చి చక్కగా అలంకృతమైనపందిరిలో బహిరంగసభ ఏర్పాటు అయినది. చుట్టుప్రక్కల పల్లెలనుంచి సుమారు 6 వేల ప్రజలు అ రించిరి

కామోజీరావుగారి కోరికపై మాగంటి బాపినీడు గారు, సభకు అధ్యక్షత వహించిరి ప్రార్థనానంతరం హైవేస్ సూ. ఇంజనీరు దురానీగారు మంత్రిగారికి పెద్దలకు స్వాగత మిచ్చుచు ఇట్లు నుడివిరి.

కృష్ణా పశ్చిమగోదావరిజిల్లాలను కలుపు ఈ ప్రాముఖ్యతగల రహదారీ సోమేశ్వరం గ్రామందగ్గర అధిక ఆటుపోటులు గలిగిన ఈ ఉప్పుటేరును దాటిపోవుచున్నది ఈ రేవువద్ద ప్రస్తుతము వంతెనలేక మనుష్యులు, పశువులు, సామగ్రులు దాటింపబడుటకు నావ ఉపయోగింపబడుచున్నవి ఈ నీటిపారుదల పోటుపాటులకు లోనై యుండుటచే సంవత్సరము పొడుగునను దాటుటకు అననుకూలముగా నున్నది అందుచే ఈ రెండు జిల్లాలమధ్య రవాణా సౌకర్యములు ముఖ్యముగా వ్యవసాయదారులకు చాల ప్రయాసకరముగా నున్నవి. ఈ కాలపు త్వరితగతినిపోవు వాహనముల రహదారికి పూర్వకాలపు చిహ్నమయిన ఈ రేవుపద్ధతి ఎంతమాత్రము సంతృప్తిగా లేదనుట యథార్థము. వ్యవసాయపు సరుకుల రవాణాకును ప్రయాణీకులకు ఎక్కువ సౌకర్యము గూర్చుటకును ఇచ్చట ఈ వంతెన చిరకాలవాంఛితమై వున్నది. మదరాసు రాజధానిలోని రహదారిల సమస్యను మొట్టమొదట పరిశీలించిన వైపన్ దొరగారి రిపోర్టులో వంతెన నిర్మాణవిషయము చేర్చబడినది. 1940-వ సంవత్సరములో సెంట్రల్ రోడ్డు ఫండు ప్రోగ్రాములో ఈ వంతెన నిర్మాణముకై లక్షలరూపాయలు మదరాసుప్రభుత్వమువారు గ్రాంటు ఇచ్చియున్నారు. 1941-43 సంవత్సరములలో 2 లక్షల 90 వేల రూపాయలకు ప్లానులు ఎస్టిమేటులు తయారుచేయబడినవి. కాని యుద్ధపరిస్థితులవల్ల మిగిలిన అన్ని స్కీములవలెనే ఈ వంతెననిర్మాణము కూడ ప్రారంభింపబడలేదు.

అయినను మదరాసు ప్రభుత్వమువారి పి. డబ్ల్యు. ఆర్. డి. పంచవర్ష ప్రణాళికలో ఈ వంతెన నిర్మాణమునకు అగ్రస్థాన మీయబడినది. ఈ వంతెనకు 60 అడుగుల పడముగల 6 కానాలుండును. ఈ వంతెనలో 22 అడుగులు పూర్తి వెడల్పుగల రహదారి వుండును. నిర్మాణమునకు రూ. 3,50,000/-లు అగునని అంచనా. రమారమి రెండు సంవత్సరములలో కట్టుట పూర్తియగును. ఈ నిర్మాణ కార్యమును కొనసాగించుటలో ప్రముఖ పాత్ర వహించిన హైవేస్ చీఫ్ ఇంజనీరు రావుబహదూర్ తిరుమల అయ్యంగారికి, మంత్రి భక్తవత్సలంగార్లకు మనము కృతజ్ఞులము. గౌరవనీయులగు మంత్రి భక్తవత్సలంగారిని ఈ వంతెనకు శంఖుస్థాపనోత్సవమును గావింప కోరుచున్నాను.

వేద మంత్ర పఠనం జరుగుచుండ సరిగ్గా 8 గంటలకు మంత్రిగారు ఉప్పుటేరువంతెనకు శంఖుస్థాపనచేసిరి. ఈ సందర్భంలో మంత్రిగారికి నూతన వస్త్రములు బహూకరింపబడినవి.

తరువాత అధ్యక్ష స్థానమునుండి బాపినీడుగారు కృష్ణాపశ్చిమగోదావరి జిల్లాలను కలుపు ఉప్పుటేటివంతెన కార్యరూపము నొందించిన మంత్రిగారు కారణ్యవాగులనియు, దీనివలన వర్తకాభివృద్ధి చాలా కలుగుననియు, అనతికాలంలో ఉప్పుటేటిని వెడల్పుచేసి, నల్లటి ముంపును వారించిన కైకలూరు తాలూకా పంటగల ప్రదేశమగుననియు, ఏలూరు, కైకలూరు రోడ్డునుకూడా పూర్తిచేయించి వర్తకాభివృద్ధికిదోహదము వ్యవలెననినుడివిరి.

రాజనాల సుబ్బారావుగారు సన్మానపత్రం సమర్పించుచు. అందులో కైకలూరు తాలూకా బుడమేరు కొల్లేరు నీటిముంపు ప్రదేశముగుటచే ప్రతిసంవత్సరము ప్రజలకు పంటనష్టమును, ప్రభుత్వమునకు రివెన్యూద్వారా రాబడి నష్టము కలుగుచున్నదనియు, మొన్నటి తుపానువలన తినుటకు ధాన్యము, శిస్తు చెల్లించుకొన శక్తి విత్తనములకు పనికివచ్చు ధాన్యంలేక పశునష్టము పడిపోయిన ఇండ్లతోనున్న ప్రజలు ప్రభుత్వముమీద ఆశపెట్టుకొని ఉన్నారనియు, విత్తనములు, ఎరువులు, దీర్ఘవాయిదాలమీద అప్పులు, ఇప్పించి, మురుగు నీటిపోవు వసతులుగూర్చి, ప్రభుత్వసహాయము చేయవలెనని అర్థించిరి. వంతెన నిర్మాణమునకు సఫలమనోరథులైన బాపినీడుగారిని ప్రశంసించిరి.

పోల్రాజు మురుగుకాలువ క్రింద రైతు సంఘం తరఫున కోలూరి అచ్చయ్యగారు ఒక వినతిపత్రము సమర్పించుచు, ఉప్పుటేరును వెడల్పుచేయుటయే గాక, పోల్రాజు కాలువను ప్రక్కదారిని సముద్రంలో కలుపు కాలువ తవ్వించవలెనని కోరిరి.

తదుపరి కృష్ణామండల వాసుల తరఫున కలపటపు సూర్యనారాయణ శర్మగారు పంచరత్నములు చదివిరి. ఖండా సూర్యనారాయణగారు సోమేశ్వరం ఆలపాడు గ్రామముల రైతులలో పుంత తమ ఇబ్బందులు తెలుపుతూ ఒక పత్రం సమర్పించిరి. సూర్యనారాయణగారు, కైకలూరు తాలూకాకు నీటి సదుపాయ మేర్పి దాళవాపంటకు అవకాశం కల్గించవలెననియు, బుడమేటికి నందిగామదగ్గర రిజర్వాయరు కట్టించి ఆ నీటిని కృష్ణానదిలోకి మరల్చు స్కీమును ఆంధ్రరాష్ట్ర అవతరణలోపుగా అమలు జరుపవలెనని కోరిరి.

## మంత్రిగారి ప్రసంగం

పిమ్మట భక్తవత్సలంగారు తెలుగులో బాగా మాట్లాడజాలనందుకు చింత వెల్లడించి ఆంగ్లములో ఉపన్యసించుచు ముందు ఈ శంఖుస్థాపనచేయ అవకాశము తమకిచ్చినందుకు కృతజ్ఞత వెల్లడించిరి.

తర్వాత స్వాగత వినతి పత్రములకు సమాధానముగ పైన ఉదహరించిన భావములు వెల్లడించిరి. ఈ వంతెన నిర్మాణము పూర్వమే జరిగిన ఇప్పుడు ఇంత ఖర్చు అయ్యేదికాదనిరి. సామర్థ్యము సేవాగుణము కలిగిన ఏనుగు అస్వాదపడ్డాడు. తన తొండముతో తనపైన తలకు గడ చల్లుకొన్నట్లు, మనలో కొందరు సమగ్రులైనవారే ప్రజాభివృద్ధి భంగకరమైన పనులు చేయుచున్నారని స్వరాజ్య సాధన ప్రయోజనం వారం గుర్తించుకోవాలని • ఉప్పుటేరును వెడల్పు చేయుట, కైకలూరు, ఏలూరురోడ్డు వేయుట గురించి ఆలోచింపవలెననిరి. పేరుకునగ పంటకు నీరుసప్లయిచేయుటకు వీలగునని ఇంజనీర్లు చెప్పుచున్నారనీ కావున ఏర్పాటు చేయగలమనిరి. అది కావాలి, యిది కావాలని ప్రజలు వాంఛిస్తే పన్నులు ఎక్కువ వెయ్యవలసి వచ్చునని ఆధారం యిక్కడ నేయక సాధ్యమైనంత త్వరలో అన్ని పనులను పూర్తిచేయనున్నామనీ నుడివిరి ఆంధ్రరాష్ట్రము త్వరలో అంతరించనున్నదనీ రాష్ట్ర విభజనానంతరం ఆంధ్ర, ద్రవిడ రాష్ట్రములవారు సోదరులవలె మెలగవలెనని తమ ఆశ అని నుడివిరి.

పిమ్మట కామోజీరావుగారు, మంత్రిగారికి, ఎంతో ఉత్సాహంతో విచ్చేసిన పెద్దలకు, 3 రోజులనుంచి శ్రమపడి సౌకర్యములు కలిగించిన సిబ్బందికి కృతజ్ఞతాపూర్వక నమస్సులు అర్పించిరి. తూర్పు కృష్ణా కాంగ్రెసువారు ఏర్పాటు చేసిన విందులో అచ్చట పాల్గొని భక్తవత్సలంగారు గుడివాడగా విజయవాడవెళ్లిరి.

### గౌ॥ బి. పరమేశ్వరన్

హరిజనమంత్రి బి. పరమేశ్వరన్‌గారు 28 రాత్రి మదరాసు విడిచి, 29, 30, విశాఖపట్నం చూసుకొని, 31 సామర్లకోట, కాకినాడ చూసుకొని 1 వ తేదీన మదరాసు వచ్చెదరు.

## భీమవరం మురుకాల్వపై క్రొత్తవంతెన

### పబ్లిక్‌వర్క్స్ మంత్రికి పౌరుల విజ్ఞప్తులు

భీమవరం, డిసెంబరు 26: పబ్లిక్‌వర్క్స్‌మంత్రి గౌ॥ ఎమ్. భక్తవత్సలం, హైవేస్ ఇంజనీర్లు, ఎసెంబ్లీ సభ్యులు మాగంటి బాపినీడు అల్లూరి సత్యనారాయణరాజు, వేముల కూర్మయ్య గార్లు మొదలైనవారితో నేటి ఉదయం ఇచ్చటకు వచ్చిరి. ఈపుర పాలక సంఘం, రేటుపేయర్సు సంఘం, తాలూకా రైతుకాంగ్రెసు సంఘముల వారు మంత్రిగారికి వినతిపత్రములు సమర్పించినారు. ఈవ్రూరిమధ్యగా ప్రవహించే ఎనమదుర్రు మురుగుకాల్వమీద యున్న వంతెన వెడల్పు తక్కువగావుండి, పాతదైనందున క్రొత్తవంతెన కట్టించవలెనని రెవిన్యూ డివిజనల్ ఆఫీసువద్ద కాలినడక వంతెన కట్టుట త్వరలో ముగించవలయునని పత్రములలో కోరిరి. మంత్రిగారు సమాధానాలు తాము మంత్రిగ ఈ పట్టణము వచ్చుటకిదియేకడసారి అనవచ్చుననియు, త్వరలో ఆంధ్రరాష్ట్రం సిద్ధిప నున్నదనియు, ఆంధ్రరాష్ట్రం వచ్చినప్పటికి తాను పూర్వమువలెనే స్నేహభావంతో ఒక ఒమిష్టి కుటుంబీకుడు వలె ఉండెదననియు చప్పుచూ, తనకు ఇచ్చిన వినతి పత్రములలో కోరిన వంతెనలు త్వరలో ప్రభుత్వం అంగీకరించగలదనిరి. ప్రస్తుతం ప్రభుత్వానికి ఆర్థికబాధ ఉన్నదనియు, కేంద్రప్రభుత్వం రెండు సంవత్సరముల వరకు ఏమీ ధనసహాయం చేయదనియు చెప్పిరి. ఈ తాలూకాలో గాలివానవల్ల పంటలు చాలా నష్టపడినవనియు, రెండవ పంటకు నీరు సరఫరాచేయగలిగినంతవరకు ప్రభుత్వం ఇచ్చినదనియు, ఇంక రెండవ పంటకు నీరు అదనంగా ఏ భూములకు ఇచ్చుటకు సావకాశం లేదనియు చెప్పిరి. దంతులూరి నారాయణరాజు గారు మంత్రిగారికి పురపాలకసంఘ సభ్యులను పరిచయము చేసిరి. కోటమర్తి కనకమ్మగారి ఆశీర్వచనములతో సభ ముగిసెను.

అనంతరం మంత్రిగారు ఆకివీడులో ఉప్పుటేరు వంతెన కట్టుడల ప్రారంభోత్సవమునకు బయలుదేరి వెళ్లిరి. (స్వ.వి.)

### కీ॥ శే॥ తాడేపల్లి వెంకటనారాయణగారు

మదరాసు, డిసెంబరు 27: శ్రీ తాడేపల్లి వెంకటనారాయణగారు, సైదరు సమజట్టి 28వ తేదీ ప్రాతఃకాలమున 72వ ఏట ఓకా ట్లాడు నగరంలో స్వగృహమున కాలధర్మమునొందిరి. వీరు సౌమ్యవాదయులు సర్ వేపా రామేశంగారి వియ్యంకులు. సిటీ సివిలుకోర్టు ప్రిన్సిపలు జడ్జి శ్రీ జి. కృష్ణమూర్తిగారి మామగారు. భార్య, యిరువురు కుమార్తెలు, మనవలు, మిత్రబంధువర్గము పెక్కుండ్రు వీరికై విలపించుచున్నారు.

## కావలెను

జమ్మలమడుగులో (కడపజిల్లా) మా ఆంధ్ర దైనిక, సచిత్రవార భారతి మాసపత్రికలను వారి స్వంత బాధ్యతపై విక్రయించుటకు న్యూసు ఏజంట్లు కావలెను. వివరములకు:

మేనేజరు,

ఆంధ్రపత్రిక. జి. టి. మద్రాసు.

## ఆంధ్రదేశ తుపాను బాధితులకు సహాయం

### నిధి వసూలుకు బర్మా ఆంధ్రుల కృషి

మోల్మెన్, డిసెంబరు 20: ఆంధ్రదేశ తుపాను బాధితుల సహాయార్థం నిధి వసూలు చేయు ఉద్దేశముతో స్థానిక ఆంధ్రులు, ఇతర భారతీయులు ఈ మధ్య ఇచ్చటి బర్మా ఆంధ్రసంఘ భవనములో ఒక సభ ఏర్పాటుచేశారు. సంఘాధ్యక్షుడు పిని శెట్టి సన్యాసినాయుడుగారు అధ్యక్షత వహించారు. పుర ప్రముఖులు ప్రజలు సుమారు 500 మంది హాజరైనారు. అధ్యక్షుడు తుపానువల్ల కృష్ణా, ఉభయ గోదావరి జిల్లాలకు కలిగిన నష్టమును వివరించారు. ఆ సంఘ కార్యదర్శి బి. ఎం. స్వామి, సభ్యులు బి కర్ణయ్య, బి. ఎస్. శెట్టిగార్లు తుపాను బాధితుల కష్టనష్టములకు సంతాపము వెలిపుచ్చుచు మాట్లాడారు. పిమ్మట నిధి వసూలుకు 5 గురు సభ్యులతో ఒక సంఘమును ఏర్పాటు చేసి, విరాళములు విరివిగా వసూలు చేయుటకు తీర్మానించారు. తీర్మానమును రాష్ట్రపతి పట్టాభిగారికి, ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్షుడు ఎన్. జి. రంగాగార్లకు పంపటానికి కూడా నిశ్చయించారు. వసూలైన సొమ్మును రంగాగారికి పంపడానికి నిశ్చయించడమైనది.

## హరిజనులకు వస్త్రాలు పంచిపెట్టుట

ఆకివీడు, డిసెంబర్ 27: కలకత్తా మార్వాడి సహాయ సంఘంవారి యాజమాన్యాన పబ్లిక్ వర్క్స్ మంత్రి గౌ॥ ఎం. భక్తవత్సలంగారు నిన్న ఉప్పుటేరు లో తుపానుబాధితులైన హరిజనులకు వస్త్రాలు పంచిపెట్టారు. ఈసంఘంవారు 20 రోజులుగా యిక్కడ మకాంచేస్తూ యీ పరిసరాలలో తుపానుబాధితులకు వస్త్రాలు పంచిపెడుతున్నారు. మంత్రిగారు వీరు చేస్తున్న సహాయాన్ని ప్రశంసించారు.

## నేషనల్ క్రిస్టియన్ కౌన్సిలు వారి సహాయము

మచిలీపట్నం, డిసెంబర్ 27: ఆంధ్ర క్రిస్టియన్ కౌన్సిలువారు ఏర్పాటుచేసిన తుపానుబాధితుల సహాయ సంఘ సభ్యులు రివరెండు డి. ఆర్. ఐజకు (గుడ్లవల్లేరు) రివరెండు జె సెట్టు (ఉయ్యూరు) డా॥ సంకిల్ బర్గరు (తెనాలి) తుపానువలన నష్టపడిన బీదలను సహాయముచేయుచున్నారు. యిప్పటికి 60 వేల మల్టి విటమిన్ బిళ్లలను పంచిపెట్టిరి. గోధుమ, బార్లీ, బీములు, పాలపొడి పొట్లాలు 272, తుపానుబాధితులకు పంచుటకు విజయవాడకు చేరినవి. ఇవి కొల్లేరుప్రాంతాల్లో వాడెదరు. 250 పౌనులగల 16 డబ్బాల పాలపొడి రానున్నది. ఈసప్లయి అంతా అమెరికానుండి వచ్చుచున్నది. ఈరిలీఫు పని అంతా నాగపూరులోని నేషనల్ క్రిస్టియన్ కౌన్సిలు వారి యాజమాన్యమున జరుగుచున్నది (స్వ ది)

## ఆంధ్రనాటక కళాపరిషత్తు కార్యవర్గసమావేశం

విజయవాడ, డిసెంబర్ 26: ఆంధ్ర నాటక కళాపరిషత్తు కార్యవర్గసమావేశం ఉయ్యూరు కుమారరాజాగారి అధ్యక్షతను 24 న యిక్కడ జరిగెను. కోట వెంకటరామయ్య, వేమూరి ఆంజనేయశర్మ, డి.నరసరాజు, త్రిపురనేని ప్రసాదరావు, వింజమూరి శివరామరావు మొదలగు సభ్యులు హాజరైరి. 1950 ఫిబ్రవరి ఆఖరు వారంలో కాకినాడలో ఆంధ్రనాటక కళాపరిషత్ 16 వ సమావేశము జరుపుటకు తీర్మానించిరి. ఈసమావేశములో యోగ్యతను నాటకపోటీలలో పాల్గొనదలచిన నాటకసమాజములవారు తాము ప్రదర్శించు నాటకముల ప్రతులను, దరఖాస్తులతో జనవరి 20 లోగా పరిషత్కార్యాలయమునకు పంపుకొనవలెనని కూడా పరిషత్తు వారు ప్రకటించుచున్నారు.

## కల్యాణి ఆంధ్ర గ్రంథాలయ సంఘ కార్యవర్గ సమావేశం

### తుపానునిధికి రూ. 500/-లు వసూలు

కల్యాణి, డిసెంబరు 20: ఈ స్థానిక ఆంధ్రజనసంఘ గ్రంథాలయముల కార్య నిర్వాహకవర్గం వీణా సుదర్శనాచార్యుల వారి అధ్యక్షతను 18 తేదీన సమావేశమై సంఘాభివృద్ధికిని గ్రంథాలయాభివృద్ధికిని సంబంధించిన విషయముల చర్చించిరి. ఈ సంఘపు 2-వ వార్షికోత్సవము జనవరి 3 వ వారమున జరుపుటకు నిశ్చయించిరి.

ఆంధ్రదేశమున తుపానువలన కష్టనష్టములకు గురియైన ఆంధ్రుల సహాయార్థమై సంఘ యాజమాన్యమున కొందరు ప్రముఖులు ఇంతవరకు ప్రోగుచేసిన మొత్తములో రూ. 500/-లు మద్రాసు గవర్నరుగారి ఆంధ్రదేశ తుపానుబాధితుల సహాయనిధికి పంపుటకు కార్యదర్శికి అధికారమిచ్చిరి. ఇంకను రూ 500/-లు వసూలు కాగలవని ఆ ప్రముఖులు సూచించిరి.

కాశ్మీర్ సమస్య:

# మెక్‌నాటన్ ప్రతిపాదనలకు భారతదేశ నిరాకరణ

## పాకిస్తాన్ దురాక్రమణ జరిపినదనే విషయాన్ని గుర్తించలేదని వాదన

న్యూయార్క్, డిసెంబర్ 28: రెండు వారాలుగా సాగుతున్న కాశ్మీరు చర్చ ఇప్పటికీ ఒకదరికి చేరలేదు. ఇండియా అవలంబించిన వైఖరిపై "బేరాలకు" తావు లేదని సంప్రతింపులు జరిపే వారు సత్తించవంతవరకు ఈసమస్య పరిష్కారం కాదు.

ఇండియా పాకిస్తాను ప్రతినిధులతో జనరలు మెక్‌నాటన్ జరిపిన సంప్రతింపులు అతిగోప్యంగా ఉంచబడ్డవి అయినప్పటికీ ఆయన సూచనలను ఇండియా ప్రభుత్వం నిరాకరించిందన్న వార్త నిన్న న్యూఢిల్లీలో పొక్కింది. ఇది పాకిస్తానుకు లాభించగలదు. ఇండియా తన సమాధానాన్ని 26 తే గడువులోగా అందజేసింది. కాని, ఇండియా ఏమన్నదో తెలుసుకోవడానికి గాను పాకిస్తాను జాప్యం చేస్తున్నది. ఇదివరలో పాకిస్తాను సాధారణంగా ఇండియా వైఖరి తెలిసినమీదటనే తన వైఖరి ప్రకటిస్తూ వచ్చింది. కాశ్మీరు కమిషనువారి ఆగస్టు 13 తీర్మానాన్ని ఇండియా ప్రభుత్వం నిరాకరించిందన్న అసత్యవార్త ఫలితంగానే ఆ తీర్మానాన్ని పాకిస్తాను నిరాకరించిందనికూడా చెబుతారు. మక్‌నాటన్ సూచనలకు పాకిస్తాను తన సమాధానాన్ని నేడే ఇవ్వనున్నది. ఇండియా వైఖరి బయలుపడడం వారికి లాభకరం.

మక్‌నాటన్ సూచనలను ఇండియా పూర్తిగా తోసివేసినట్లు తెలుస్తున్నది. ఈసూచనలకు అంగీకరిస్తే అన్నివిధాలా ఇండియాయే నష్టపడవలసి వచ్చేదట. కాశ్మీరు ఉత్తరప్రాంతంలో ఇండియా సైనికరక్షణ ఏర్పాటు చేయరాదని మక్‌నాటన్ సూచించారట. ఆజాద్ సైన్యాన్ని రద్దుచేయడానికి ఒప్పుకొంటూనే, అది భారత సైన్యాల ఉపసంహరణతో బాటు జరగాలనీ ఆజాద్ ప్రాంతరక్షణ నిమిత్తమై కొద్దిసేనలు ఉంచబడాలనీ, సైన్యాల ఉపసంహరణ క్రమంసరించి ఉభయపక్షాలమధ్య సంప్రతింపులు జరగాలనీ ఆయన సూచించారట.

వీటతాత్పర్యం పాకిస్తానుకు ఇండియాతో సమప్రతిపత్తి ఉన్నదని అందుచేత ఇండియా ఈ సూచనలను ఆమోదించదు: పాకిస్తాను దురాక్రమణ చేసిందనీ, పాకిస్తానుకు న్యాయరీత్యాగాని, నైతికంగాగాని కాశ్మీరులో కాలుపెట్టే అధికారంలేదనీ పూర్తిగా విస్మరించబడే అవకాశంకూడా ఉన్నది.

పాకిస్తాను సమాధానం ఆలస్యం కావడంచేత భద్రతామండలి సమావేశం రోజురోజూ వాయిదా వేయబడుతున్నది. శెలవుదినాల్లో అనంతరం జరిగే సమావేశంలో జనరలు మక్‌నాటన్ తాను ఉభయపక్షాలప్రతినిధులతో చేసిన సంప్రతింపులు వివరిస్తారు.

## భద్రతామండలిలో కాశ్మీరుసమస్య

### నాల్గోసారి వాయిదా

లేక్‌సక్సెస్, డిసెంబర్ 28: ఈ వేళ సాయంత్రం కాశ్మీర్ విషయమై చర్చించటానికి జరగవలసిన భద్రతామండలి సమావేశాన్ని అధ్యక్షుడు మెక్‌నాటన్ రేపు సాయంత్రానికి వాయిదా వేశాడు. కాశ్మీర్ సమస్యపై భద్రతామండలి సమావేశం వాయిదా పడటానికి ఇది నాలుగోసారి.

నేటి ఉదయం పాకిస్తాన్ విదేశాంగ మంత్రి జఫ్రుల్లా మెక్‌నాటన్‌ను కలుసుకుంటాడు. భారత ప్రతినిధివర్గం మెక్‌నాటన్‌ను కలుసుకునే ఆలోచన లేదు.

తనకు తెలిసినంతవరకూ ఇంతకుమించి భద్రతామండలి సమావేశంలో ఆలస్యం జరగదని కెనడా ప్రతినిధివర్గానికి చెందిన ఒక ఉద్యోగి నేడిక్కడ సెలవిచ్చాడు.

మెక్‌నాటన్ సూచనలకు పాకిస్తాన్ ప్రభుత్వం సమాధానంపంపినదని పాకిస్తాన్ ప్రతినిధి సెలవిచ్చాడే కాని వివరాలను చెప్పలేదు.

పాకిస్తాన్ సమాధానం అందకముందే ఇండియా ఆ సూచనలను నిరాకరించినట్లు ఢిల్లీలో అధికారవర్గాలద్వారా తెలిసినట్లు ఇక్కడికి వార్తలు వచ్చినవి. ఈ వార్తలు రావటం ఇక్కడ ఎంతోమందికి ఆశ్చర్యం కలిగించింది

జనరల్ మెక్‌నాటన్ నేడు భద్రతామండలికి ఇవ్వవలసిన తన నివేదికను తయారుచేస్తున్నాడు. ప్రస్తుత భద్రతామండలి కాలం ముగిసిపోయేలోపు గానుండే ఈ నెలాఖరులోగా ఈ సమస్య పరిష్కారం విషయమై చెప్పుకోదగ్గ అభివృద్ధికలగగలదని సమితివర్గాలు భావిస్తున్నారు.

## "నెహ్రూమామ"

### భారతప్రధానికి జపాను పిల్లలు పెట్టినపేరు

న్యూఢిల్లీ, డిసెంబరు 27: జపానుదేశపు బిడ్డలు భారత ప్రధానామాత్యుడను పండిత నెహ్రూగారికి 'నెహ్రూమామ' అను బిరుదిచ్చిరి. భారతదేశమునంచిన పిల్లలకుగాను వారు కొన్ని బహుమానములుగూడ పండిత నెహ్రూగారికి పంపియున్నారు. వీనిలో పెద్దబొమ్మలు, భారతదేశము జపాను పిల్లలకు పంపియుండిన ఏనుగు 'ఇందిర' చిత్రములు కలవు. త్వరలో మృగముల ఆర్కెస్ట్రాబాండును వారు పంపనున్నారు. ఈ ఆర్కెస్ట్రా సంగీతము భారతదేశపు పిల్లలకు ఆనందము కలుగజేయునని తన్నిర్మాత సుప్రసిద్ధజపాను బొమ్మలకారుడు చెప్పెను. ఈఆర్కెస్ట్రాలో చేరియున్న ఒక ఆడవి ఎలుగుబంటికి, ఇతరబహుమానములను శాంతికాముల సభకు వచ్చిన జపానుప్రతినిధి మచాంటోమికో కోరా పండితనెహ్రూగారికి అందజేసిరి.

ఇందిరను జపాను చిత్రవస్తు ప్రదర్శనశాలలో ఒక్కొక్కటి 10 వేలమంది జపాను బాలురు స్వాగతి మొసంగిరని, ఇందిరను జపాను పిల్లలకు బహూకరించు ఉత్సవమునకు ఆనాడు వచ్చినంత మంది మరెప్పుడు రాలేదని టోకియో దైనికపత్రిక 'అసాహిసంఖన్' వ్రాసినది. జపాను ప్రధాని యోషిడా మందహాసభాసుర వదనారవిందుడై యుండెనని గూడ పత్రిక వ్రాసెను. ఇందిర ఆకృతిలోనున్న బొమ్మలను, చిత్రములను జపాను నందంతట అమ్ముచున్నారు.

## నరేంద్రదేవ్ ఉద్ఘాటన

(1 వ పేజీ తరువాయి)

లను, దక్షిణభారతంలోని భాషలను దగ్గరకు తీసుకొనివచ్చి, ఈ భాషలను జాతీయభాషతో సన్నిహితంచేయుటానికి ఈసభ ఉద్దేశిస్తున్నది. ఒకభాషవారికి మరొక భాషలోను, వానిసాహిత్య, విజ్ఞానాలలోను ఆసక్తికలిగించటానికి, ఒకభాషలోని గొప్పగ్రంథములను మరొకభాషలోనికి తర్జుమాచేయించటానికి ఈ సభ ప్రయత్నంచేస్తున్నది. భారతదేశంలోని అన్నిభాగాలకు సంస్కృతం ముఖ్యమైనది కనుక సంస్కృతమును సాధ్యమైనంతగా ప్రజాసామాన్యంలో వ్యాప్తిచేయుటకు ప్రయత్నింపవలసి ఉన్నది."

ఆచార్య నరేంద్రదేవ్ తమ ఉపన్యాసమును కొనసాగిస్తూ ఇంకా ఇలాగన్నారు.

"భారతదేశంలో వివిధ భాషలు, లిపులు ఉన్నప్పటికీ, మన మానసిక తత్వం ఏరంగంలో చూసినా ఒకటిగానే వున్నది. ఇండియాలో కాశ్మీర్ నుండి కన్యాకుమారివరకు ఒకే సంస్కృతి వ్యాపించివున్నది. ఈ సంస్కృతీ బంధము త్రెంచరానిది. హిందీని నిజమైన జాతీయ భాషగా యొప్పుకొనుటచే హిందీభాషా ప్రజలు దాక్షిణాత్యుల యెడ సమరసభావంతో మెలగుతూ, వారిభాషలనుకేర్చుకొని, అందుండి హిందీభాషను వృద్ధిచేయుటకు కావలసిన పదజాలమును సంగ్రహింపవలెను. లక్నో విశ్వకళా పరిషత్తువారు తెలుగు, తమిళం నేర్చుకొనగోరేవారికి ప్రత్యేక తరగతులు ఏర్పాటుచేసినందుకు నేను చాలా సంతోషిస్తున్నాను.

ఈ సాహిత్య సభవారు హిందీ సాహిత్యసమ్మేళనంలో ఒక ప్రత్యేక శాఖగా ఏర్పడి తమ కార్యక్రమమును విస్తృతం చేసికొని పనిచేయవలయునని నా సలహా. హిందీ ప్రజల ఉపయోగానికిగాను, హిందీపత్రికలలో దాక్షిణాత్య భాషలను గూర్చి, వారి సారస్వతమునుగూర్చి వ్యాసములను వ్రాయవలెను.

నిజం చెప్పాలంటే ఉత్తర దేశీయులకంటే దాక్షిణాత్యులే ప్రతిభావంతులు, సాహసోపేతులు. ఔత్తరాహులు ఒకటి లేక రెండు దక్షిణదేశ భాషలను నేర్చుకొనేవరకూ తమ విద్యాభ్యాసం పూర్తి అయినట్లు పరిగణింపరాదు. దాక్షిణాత్యులు జాతీయభాషయైన హిందీని ఎలాగూ విధిగా నేర్చుకుంటారు."

## 1950 కాలెండర్లు

చెన్నపట్నం బర్మా షెల్ ఆయిల్ అండ్ డిస్ట్రిబ్యూషన్ కంపెనీ, ఎ. హెచ్. అహమ్మద్ అండ్ కంపెనీ (255 లింగిచెట్టివీధి, చెన్నపట్నం) స్వస్తిక్ ఎలెక్ట్రిక్ కంపెనీ (చెన్నపట్నం) వారి 1950 సం॥ క్యాలెండర్లు మాకార్యాలయమునకు అందినవి.

## మద్రాస్‌లోనే ఆంధ్ర ప్రభుత్వకార్యాలయం

(1-వ పేజీ తరువాయి)

గూర్చి నేడు చర్చ కొనసాగించబడెను. ఈ చర్చ రేపు పూర్తికాగలదు. ఉద్యోగుల గూర్చిన ఉపసంఘ నివేదిక నేడు చర్చకు రాలేదు. రేపు 2 గం॥ సంఘం సమావేశమయినపుడు యీ విషయం చర్చింపబడగలదు. ఇద్దరు మంత్రులు రేపు మదరాసు విడచుచున్నారు గనుక, చర్చలు రేపు పూర్తికాగలవని ఎంచబడుచున్నది.

విభజనసంఘం నివేదిక ఏకగ్రీవంగానే యుండగలదనియు, అరవసభ్యులు-ఆంధ్ర సభ్యులు రెండువర్గాలుగానే యెంచి యీ రెండు వర్గాలు ఏకీభవించకుండినపుడే అది భిన్నాభిప్రాయాల నివేదికగ ఎంచబడగలదుగాని, ఏ ఒకసభ్యుడో తన వ్యక్తిగతాభిప్రాయం వెలిపినచో అది భిన్నాభిప్రాయంగా ఎంచబడదనియు అధికారవర్గములందు భావించబడుచున్నది.

### తాత్కాలిక రాజధానిలోనే ఆంధ్రమంత్రుల ప్రమాణ స్వీకారం

చెన్నపట్నం, డిసెంబరు 29: ఆంధ్ర నాయకులు తాత్కాలికమైన రాజధాని, హైకోర్టు ఉండుస్థలము పేరు చెప్పటకును, ఈ రెండూ ఏర్పాటు చేసుకొనువరకు చెన్నపట్నంలో ఆంధ్ర సెక్రటేరియట్, హైకోర్టు ఉండుటకు తమిళ నాయకులు నేడు తలవని తలంపుగా అంగీకరించినవనియు, ఆంధ్ర తమిళ నాయకులీ విషయమై ఒప్పందమునకు వచ్చినటుల నమ్మదగిన రూఢిగా తెలియుచున్నది. అసలును పేరు తాత్కాలికముగా అనంతపురమనియు, దీనికి శాసనసభ్యులు, రాష్ట్ర కాంగ్రెసు వారు అంగీకరించవలసి ఉండుననియు, విభజన సంఘంవారి నివేదికను మద్రాసు మంత్రివర్గము ఆమోదించి, మద్రాసు ప్రభుత్వమువారు ఆ నివేదికను కేంద్ర ప్రభుత్వమునకు పంపులోపల అతంతు జరుగగలదనియు అభిజ్ఞ వర్గములవారు తెలుపుచున్నారు హైకోర్టును విడదీయుటకు 6 వ తేదీ ఉభయ శాసనసభల సమావేశములో ఒక తీర్మానము ప్రవేశపెట్టబడుననియు, ఆ ప్రకారము హైకోర్టు ఏర్పాటు గాగలదనియు తెలియుచున్నది. రాజధానిఅనగా తమిళుల నిర్వచనము ప్రకారము సెక్రటేరియట్, అసెంబ్లీ హైకోర్టు ఉన్న స్థలము అయితే ఆంధ్రప్రభుత్వము మద్రాసు నుంచి తరలియుపోనటుల నిదర్శనముగా ఆంధ్రగవర్నరు, ఆంధ్రప్రభుత్వమంత్రులు తాత్కాలికమైన రాజధానీ నగరములోనే ప్రమాణస్వీకరణ చేయవలసివుండుననియు, ఆంధ్ర అసెంబ్లీ సమావేశములు అచ్చటనే జరుగవలసి ఉండునన్న షరతులను తమిళ నాయకులు ఉపసంహరించుకొనలేదు. సెక్రటేరియట్, హైకోర్టు, తాత్కాలిక రాజధానికి మారినట్లు నిదర్శనముగ ఒకటి రెండు కార్యాలయములు అక్కడకు పెళ్ళవలెనని తమిళులు అనుచున్నారు.

ఆంధ్రులు రాజధాని పేరు చెప్పుటకును అచ్చటస్థిరపడి పోవువరకు మద్రాసులో ఆంధ్రప్రభుత్వము ఉండుటకును ఆదిలో తమిళనాయకులు అంగీకరించి, మధ్యన కథమార్చి, ఇందుకు సత్యమైన దారికివచ్చి న్యాయమును గుర్తింపకల్గినందులకు ఆంధ్ర నాయకులు సంతోషించుచున్నారు. చెన్నపట్నంనుంచి మూటముల్లెకట్టుకొని నాలుగుమాసాలలో పూర్తిగా తర్లిపోవలెననియు, జనవరి 26 కే ఆ పలస ప్రారంభము గావలెననియు, తమిళనాయకులు మొట్టమొదటి ప్రమాణమునకు విరుద్ధముగా వర్తించుచున్నారని ఆంధ్రనాయకులలో ఒక వర్గమువారు భారతప్రధానికి, ఉపప్రధానికి పంపిన విజ్ఞప్తి ఫలితముగా తమిళనాయకుని వారి వైఖరి జయలబడి, నవ్వులపాలు గాకుండు లోపున దారికి వచ్చినారనియు, పైనుంచి మందలింపు వచ్చులోపునే తమిళనాయకులు సబబుగ వర్తించుట వారు మధ్యన చేసిన తప్పును దిద్దుకొన్నట్లున్నదని ఆంధ్ర నాయకులు భావించుచున్నారు.

అనంతపురంలో అసెంబ్లీ పెట్టుకొనుటకు శాంతి స్మారకభవనము చాలదనీ, అందువల్ల శాసనసభ సమావేశములు జరుపుకొనుటకు పది పది హేనులక్షలు పెట్టి తక్షణమే భవననిర్మాణమునకు పూనుకొనవలెననియు, ఆంధ్రవర్గములవారు భావించుచున్నారు.

### ఆస్తి అప్పుల విభజన

ఆస్తి అప్పుల విభజనలో కొన్ని హంశములకు జనాభా ప్రకారం, కొన్నిహంశములకు రెవెన్యూ ప్రకారము పంపకము జరుగవలెనని తమిళ నాయకులు నేటి విభజనసంఘ సమావేశములో వాదించినటుల తెలియుచున్నది. జనాభా ననుసరించియే ఆస్తి అప్పుల విభజన జరుగవలెననియు, దక్షిణాది విశ్వవిద్యాలయ ప్రణాళికలు వివిధంగా అమలు జరిగినందున అందుకు పరిహారముకట్టి కొన్ని కోట్లు ఇవ్వవలెనని ఆంధ్రనాయకులలో ఒకవర్గమువారు వాదించుచున్నారు, ఆంధ్రదేశంలో ఇరిగేషను

## శాంతివాదులకు గాంధి తాయత్తు

### సేవాగ్రామ్ సభలో బహూకరణ

సేవాగ్రాం, డిసెంబర్ 28: ప్రపంచ సౌమనస్య సమావేశానికివచ్చిన విదేశ ప్రతినిధులు, తమ తమ దేశాలకు తీసుకుపోబోతున్న అమూల్యవస్తువులలో "గాంధీ తాయత్తు"కూడా ఒకటి.

ఈ తాయత్తు, మహాత్ముడు బెంగాలులోని ఒకకాంగ్రెస్ సేవకునికి వ్రాసిన లేఖలోని ఒకభాగం. లోగడ నౌకాలీలో గాంధిజీ అంతరంగిక కార్యదర్శిగా పనిచేసిన నిర్మల కుమారబోస్‌గారు ఈ తాయత్తులను అందరు ప్రతినిధులకూ బహూకరించారు. ఆలేఖయొక్క భాగాన్ని గాంధిజీ చేవ్రాలుతోసహా అందమైన కార్డులమీద ముద్రించి పంచిపెట్టారు.

ప్రతినిధులంతా, వాటిని స్వీకరించి చాలా ఆనందించారు. వీటిని ఉచితంగా మా ప్రజలందరికీ పంచిపెట్టుకుంటామన్నారు.

తాయత్తుమీది లేఖభాగం

'ఒక తాయత్తు నిస్తున్నాను. నీకు సందిగ్ధావస్థ సంప్రాప్తించినప్పుడు, నీ వ్యక్తిత్వం నీకు అడ్డుతగిలి యిబ్బంది పెడుతున్నప్పుడు ఇలా చెయ్యి. గర్భదరిద్రుడుగానూ, నిరాధారుడుగానూ వున్న నీవు చూసివున్న ఒక నిరుపేద ముఖాన్ని నీ స్మృతి పథానికి తెచ్చుకో; నీవు ఆచరించబోతున్న కార్యం ఆజాలికేమైనా ప్రయోజనకరంగా వుంటుందా అని యోజించు, దానివల్ల అతనికేమైనా లవలేశమైనా సహాయం జరిగే సావకాశంవుందేమో ఆలోచించు. దానివల్ల అతని జీవితంమీదా అతని భవిష్యత్తుమీదా అతనికేమైనా ఆధిపత్యం యేర్పడే సావకాశమున్నదేమోచూడు. దీన్నే మరోవిధంగా చెప్పాలంటే—మనదేశంలో, శారీరకంగానూ, ఆధ్యాత్మికంగానూ కూడా ఆకలితో మాడిపోతున్న ఈ లక్షలాది ప్రజానీకానికి స్వరాజ్యసిద్ధికలగటానికి స్వయంపాలన యేర్పడటానికీ సావకాశమున్నదేమో పరీక్షించు. అలాచేస్తే నీ సందేహాలూ, నీ వ్యక్తిత్వ నిరోధం వెంటనే మంచులా కరిగి మార్గం కనపించుతుంది.

—యం. కె. గాంధి.

### గౌ॥ గోపాలరెడ్డిగారు

గౌ॥ బి. గోపాలరెడ్డిగారు 30 తే. రాత్రి మద్రాసు విడచి 31 గుంటకల్లులో దిగి కారులో బళ్లారి పోయి, ఆరాత్రియే, తిరిగి బయలుదేరి జనవరి 1 తే. మదరాసు వస్తారు. గౌ॥ భక్తవత్సలంగారు వీరితో పడలుచున్నారు. విభజన సంఘం విచారణ సందర్భమున వీరు బళ్లారి పోవుచున్నారు.

---

ప్రాజెక్టులు వృద్ధి అయినందున, మూడు వాల్లు లక్షలటన్నుల ధాన్యం మిగులుగా పరిణమించినందున, అంతకూ కొన్ని కోట్లు పరిహారము తమకు కట్టి ఇవ్వవలెనని తమిళులు వాదించుచున్నారు. రేపు సాయంత్రములో ఈ విషయము లన్నిటిపై ఆఖరు నిర్ణయము జరుగ గలదని ఉభయపక్షముల వారూ ఆశించుచున్నారు.

శాసనసభలలోని నామినేటెడ్ సభ్యులను రద్దుచేయుటకు మొదట నిర్ణయించుకొనిరిగాని ఈ విషయమై పునర్విమర్శ జరుగుచున్నట్లు తెలియుచున్నది.

హైకోర్టు తీర్మానము అసెంబ్లీ లో వచ్చినప్పుడు రాజధాని, హైకోర్టు, ఆస్తి అప్పులు చర్చింపబడునుగాని 5, 6 తేదీలు ఇందుకు ఏర్పాటుచేయబడినవని సభా నాయకుడు గోపాలరెడ్డిగారు పత్రికా ప్రతినిధులతో తెలిపిరి. రాజధాని తాము తీసుకొనట ఖాయముగాబట్టి బెజవాడ పేరు హైకోర్టుకు సూచింపవచ్చునని రాయల సీమవారు అనుచున్నారు. ఇది శాశ్వతమైన ఏర్పాటుకాదు గనుక, ఆ ఏర్పాటు చేయునంతవరకు రెండూ ఒకేచోట ఉంచవచ్చునని కోస్తా నాయకులు కొందరు వాదించుచున్నారు.

## మైసూరులో అడవి ఏనుగుల వేట

### భారత కార్మిక మంత్రి జగజీవన్‌రామ్ సందర్శనం

మైసూరు, డిసెంబరు 28: భారత కార్మిక మంత్రి జగజీవనరామ్ ఈ వేళ రాష్ట్రీయ కార్మిక మంత్రులతో కలిసి ఇక్కడికి సమీపంలో ఉన్న కాకన్ కోటలో అడవిఏనుగలను పట్టుకోవడం సందర్శించారు. రాష్ట్రీయ కార్మికమంత్రులందరు ఇక్కడ కార్మికమంత్రుల సమావేశంలో హాజరైనారని తెలుస్తున్నది. ఇలాగ అడవిఏనుగలను పట్టుకోవడం ప్రపంచంలో ఎక్కడా ఇంత బాగా అభివృద్ధి పొందలేదని తెలుస్తున్నది 15 రోజులకు పూర్వమే అడివిఏనుగలనన్నింటినీ, ఒక ఆవరణలోనికివచ్చేటట్లు చేసారట. ఆతర వాత వాటిని ఒకనాటికొకటి, వరసగా నిర్బంధిస్తారట. ఈ విధంగా అడివిఏనుగలను పట్టుకోవడాన్ని మైసూరులో ఖెడ్డా అంటారట.

ఈ సారి ఈ ఏనుగులను పట్టుకునే ఏర్పాటును, మైసూరు అటవీ శాఖాధిపతి చేశారు. పూర్వం ఏ సంస్థానానికి ఎప్పుడైనా ప్రసిద్ధులైనఅతిథులువస్తే వారికి ఈ గజబంధనం ప్రదర్శనంగా చూపించేవారట. ఈ సారి గజబంధనానికి మైసూరు మహారాజాకూడావచ్చి ఈ గజబంధనం బాగున్నదని ప్రశంసించినట్లు తెలుస్తున్నది. ఈపర్యాయం దాదాపుగా నలభై ఏనుగులను పట్టుకున్నారని తెలుస్తున్నది.

### కూచ్ బీహార్ పశ్చిమ బెంగాలులో విలీనం

న్యూఢిల్లీ, డిసెంబర్ 28: 1950 సం॥ జనవరి 1 తే నుండి కూచ్ బీహారును ప. బెంగాల్‌లో లీనముగావింప భారత ప్రభుత్వమువారు నిర్ణయించిరని, 1935 సం॥పు భారత ప్రభుత్వచట్టం 290 ఏ సెక్షను ననుసరించి ఉత్తర్వు జారీచేయు విషయము ప్రభుత్వవిచారణలో నున్నదని సంస్థాన శాఖవారి ప్రకటన యొకటి తెలుపుచున్నది.

## విజయప్రభ

చెన్నపట్నం, డిసెంబరు 29: ఆర్ వెంకట సుబ్బారెడ్డిగారు నేడు విజయప్రభ అను తెలుగు దినపత్రిక సంపాదకుగా చీఫ్ ప్రెసిడెన్సీ మేజస్ట్రేటు కోర్టులో డిక్లరేషన్ పొందారు. ఈ పత్రికను విజయ పబ్లికేషన్స్ లిమిటెడ్ వారు మద్రాసు నుంచి ప్రచురిస్తారు.

పెరంబూరు బారకాసులో కురుకుపేట పురం కార్పొరేషను ఆస్పత్రి ప్రారంభోత్సవం 30వ తేదీ శుక్రవారం సా 5-30 గ. లకు జరుగును.

ఎం. ఎస్. ఎం. రైల్వేలో రాయపురం స్టేషనులో 1వ తేదీనుండి ఎలక్ట్రి దీపములకు కంకాలు అమర్చబడెను.

జనవరి 10వ తేదీనుండి హాస్పిటల్ - సమెహల్లి స్టేషనులమధ్య మిక్స్‌డు రైళ్ళు వారానికి మూడురోజులు సోమవారం, బుధవారం, శనివారము లందు మాత్రం నడచును.

---

ఆంధ్రరాష్ట్ర కిసాన్ కాంగ్రెసు కార్యవర్గ సమావేశము జనవరి 1 వ విజయవాడలోని ఆంధ్రరత్న భవనంలో జరుగును.

కృష్ణాజిల్లా ఫాబ్రికేటర్స్ అసోసియేషన్ సర్వసభ్య సమావేశం డిసెంబరు 30-వ విజయవాడలో జరుగును.

